వేంకటరావు, కవికొండల, 1892-1969

పొట్టికత

నరసాపురం, 1929

Record no. 658

Vēṅkaṭarāvu, Kavikoṇḍala, 1892-1969

Poṭṭikata

Narasāpuraṃ, 1929

Record no. 658

# SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

వేంకటరావు, కవికొండల, 1892-1969.
    పొట్టికత / కవికొండల వేంకటరావు.- 1. కూర్పు.- నరసాపురం : కవికొండల వేంకటరావు, 1929.
    (3), 64, (2) p. ;18 cm.
Record no. 658

Vēṅkaṭarāvu, Kavikoṇḍala, 1892-1969.
    Poṭṭikata / Kavikoṇḍala Vēṅkaṭarāvu.- 1. kūrpu.- Narasāpuraṃ : Kavikoṇḍala Vēṅkaṭarāvu, 1929.
    (3), 64, (2) p. ;18 cm.
Record no. 658

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB    Date filming began: 25 January, 2006




అనురసంజ—దీపకళిక—శీ క—3



శ్రీ సీతా...

నిర్వాహకులు

గారి ...

( క వి )

కవికొండల వేంకటరావు, బి. ఎ., బి. ఎల్.,




అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితము.

మొదటి కూర్పు

1929



వెల రు 0—8—0.

## ఏతత్కవి కృతములచ్చుపడ్డవింకను.



| | |
|---|---|
| కొండకొలకు వికసితోత్పల సంపుటము I గీతికలు. | రు 1—0—0 |
| కొండకొలకు వికసితోత్పల సంపుటము II పద్యములు | రు 1—0—0 |
| వివిధ కుసుమావళి | 0—12—0 |
| చదువులదుత్త. | 0—4—0 |
| చిట్టికైత | 0—6—0 |

వలసినచో,

కవికొండల వెంకటరావు,

నరసాపురం,

పశ్చిమ గోదావరి,

అని వ్రాయనగు.

# మాటా మంతా.



ఈ కతల కెవరిచేతనైనా యుపోద్ఘాతము వ్రాయిద్దామా అంటే వీనిలో నేమీ లేదంటారేమో ననే భయం. నేనే వ్రాదామా అంటే ఉపోద్ఘాతం వ్రాసేలోపుగా కతలు చదువుకుందా మని కతలు చదువుతూంటే ఉపోద్ఘాత మెందుకనీ యుత్త్రాత.

అందుచేత ఏయుపోద్ఘాతమూ లేకుండానే యీ కతలచ్చుపడ్డాయి.

అయితేం ఒకధైర్యము. చదువరులు కొసకంటా అన్ని కతలూ చదువుకుపోతే యొకటైనా నచ్చకపోతుందా? చదువరులలో అనేక తరహాల చదువరు లుంటారు. స్త్రీ లుంటారు పురుషు లుంటారు. పిల్లలుంటారు. పిల్లల్లో ఆడపిల్ల లుంటారు. మగపిల్ల లుంటారు. అన్నిటికంటె చిత్రం! పిల్లలలో పెద్ద లుంటారు. పెద్దలలో పిన్న లుంటారు. పైకిమాత్రమెవరికీ యేయూహా లేనట్లా పడతా రంతే. తుద కంతా అన్ని కతలూ చదివే వారే! చదివేసిన వెనుక ఎవరి యుపోద్ఘాతము వారే యీపాత్రమును గుఱించి వారివారి హృదయఫలకములమీద జిత్రించుకోకుండా ఊంటారా? అదీ నాధైర్యం.

నరసాపురము,
25—8—1929.

క॥ వెం॥

# పాట్టికత.

# 1 అవిఘ్నమస్తు.



[నరసింహారావు—లక్ష్మీదేవి—ప్రవేశింతురు.]

నరసింహా:— దేవీ! ఈవేళ మాయింట్లో ఎంచక్కా ఉండ్రాళ్లు, మీయింట్లో వండుకుంటున్నారా?

లక్ష్మి:— మాయింట్లోను మేం వండుకుంటున్నాం. మా అమ్మ వండుతూంది.

నరసింహా:—అట్లయినా మీయింట్లో పాలవెల్లి, పత్రి, పువ్వులు, కొనుక్కున్నారా?

లక్ష్మి:—పాలవెల్లి కొనుక్కున్నాము. పువ్వులు, పత్రి, అన్నీ మాతోటలోనుంచి వెంకడు తీసికొచ్చినాడు.

నరసింహా:— పోనీలే. ఏలాగైతేం, కొనుక్కుంటేం, తోటలోనుంచి వస్తేం? మీ యింట్లోను పువ్వులూ పత్రీ అన్నీ యున్నాయన్నమాటే? ఇంకా నీవు కొనుక్కోలేదనుకొన్నాను. మీ గుమాస్తాని కీలా మామిడాకుల తోరణం గట్టాడా మఱి?

లక్ష్మి:— కట్టకేం? ఇంకా మా నాన్నగారు తామరపువ్వులు మొక్కజొన్నపొత్తులు, అన్నీ పట్టుకువస్తానన్నారు!

నరసింహా:—మా నాన్నగారూ తెచ్చిపెడతా నన్నారు.
మీ యింటికి విఘ్నేశ్వరుడు వచ్చినాడా?

లక్ష్మి:—విఘ్నేశ్వరుడా? ఎవరు?

నరసింహా:—విఘ్నేశ్వరు డెవ రంటున్నావు? మీయింటి కింకా రానేలే? మా యింటికి వచ్చాడు! చూడు! ఇదిగో!

[విఘ్నేశ్వర ప్రతిమను జూపును.]

లక్ష్మి:—ఓసి! ఇదా? దేవుడా? మా యింటికీ వచ్చాడు. మాఅన్నయ్య పట్టుకొని వచ్చాడు. అదీ ఇదీ యోలాగే ఉన్నవి. దీని పేరేమి టన్నావు?

నరసింహా:—విఘ్నేశ్వరుడు.

లక్ష్మి:—మా అమ్మ దేవు డంది.

నరసింహా:—ఏమైతేంగాని త్వరగా పూజ చేసికొని మా యింటికి రా. ఎంచక్కా రోజంతా ఆడుకుందాం?

లక్ష్మి:—ఏమి! బడిలోకి వెళ్లవు? నరసింహారావు?

నరసింహా:—ఈ వేళ బడిలేదు. ఈ వేళ అస లేమిటో నీకు తెలుసునా? విఘ్నేశ్వరుని చవితి పండుగ. పండుక్కి మా బడికి సెలవు. నీవు కూడా బడిలో చదువుకుంటే నీక్కూడా సెల వుండునా?

లక్ష్మి:—ఆలాగైతే! రేపటినుంచి వస్తాను. మాఅమ్మ రేపటినుంచి నన్నుకూడా నీతో పంపుతా నని అప్పుడే



యీవేళ నాకు కొత్తపుస్తకం కొంది. అది యీవేళ దేవుని దగ్గఱ పెట్టి పూజ చేసికొని రేపటినుంచి బడిలోకి తెచ్చుకుంటాను.

నరసింహా:—ఆలాగే. నేనూ నాపుస్తకం పెట్టి పూజచేసుకుంటాను. పూజచేసుకు చదువుకుంటే అప్పుడు బాగా చదువు వస్తుంది. అవిఘ్నమస్తు. వెళ్ళి త్వరగా రావేం. నీ కొత్తపుస్తకం పే రేమిటి?

లక్ష్మి:—"పాట్టికత"

నరసింహా:—[నవ్వుతూ] నాదగ్గఱా ఉంది "చిట్టికైత!"

[నిష్క్రమింతురు.]

---

## 2 కావ్యపఠనము.



"మబ్బు-వాన-మెఱపు-ఉఱుము-రైతులు-చేలు-చెఱువులు
వరిచేలు-తొలకరివానలు

వానకాలము వచ్చెను-చెఱువులు నిండెను.
రైతులకుఁ బని తగిలెను-పశువులకుఁ బచ్చిక మొలచెను.
ఆకాశమున మబ్బు పట్టెను.
నేలపై వాన గురిసెను.

రైతులకు జేతినిండపని కలిగెను-నీటిలో వరిచేలు మునిగి తేలెను.

కప్పలు బెకబెకలాడెను - చేపలు మిలమిలలాడెను.

వేసంగియెండలులేవు - శీతకాలపుఁ జలిలేదు.

గాలి చల్లగా వీచుచుండెను - పిల్లలు వీధి నాడుచుండిరి.

బాలురు వానాలప్ప - బాలిక లొప్పులకుప్ప.

హాయి! హాయి!

అదిగో! ఎండ! అదిగో! వాన!

ఎండావానా కుక్కలనక్కల పెళ్లి.

మెఱుములు కాగడాల్ - ఉఱుములు రామఢోల్.

ఇంద్రధనుస్సు పాలకీ!

పట్టేవా రెవరోయి? ఎత్తేవా రెవరోయి?

మేంగాం! మేంగాం!

సీతాఫలాలు, రామాఫలాలు, జామిపళ్ళు, అల్లోనేరేళ్ళు,

ఫలప్రదాన మెవరికోయి?

మాకు - మాకు - బలే!

చల్లపడింది నాఒళ్లు - చినుకుపడి,

తెల్లపడ్డాయి నాపళ్ళు - ఎండపడి."

ఆలాగు ననుచు, సుస్వేచ్ఛ నాడుకొను శిష్యవర్గమును పంతులుగారు, పిలచి బోధించిరి. "ఇది ఆషాఢము. శూన్యమాసము. పెండ్లిముహూర్తము లుండవు. పాఠము సెప్పెద



వినుఁడు. "ఆషాఢస్యప్రథమదివసే మేఘమాశ్లిష్టసానుం, వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ" అని.

పాఠము జదువుకొని పిల్ల లడిగినారు. "గురువరా! ప్రతినిత్తెము మీపాఠము జదువుకొనెదముగాని, మాకు ఆషాఢస్యప్రథమ దివసమందుమాత్ర మాటవిడుపు గావలె"నని.

ఎందుకని నిర్బంధించి యుపాధ్యాయులు ప్రశ్న వేయఁ బిల్ల లిట్లు బదులాడిరి. "ఆ మేఘము నాకొండ చఱియ నవ్వేళ కా పోలిక నరయవలతు"మని.

ఉపాధ్యాయుఁ డుప్పొంగి "అంతల కగునేని తప్పక సెలవిచ్చితి. పొండు. పిచ్చి పిచ్చి గంతులు వేయకు" డని పిల్లల నంపివేసెను.

ఇక నొంటరిగ నున్న యయ్యవారిముం దప్పుడు భగవంతుండు బ్రత్యక్షమయి "ఆర్యా! నీ చిన్నరిపొత్తమునందలి చిన్న పాఠమున బ్రదర్శించిన ఒకనాటి యొకానొక కొండ మీఁది యొకానొక మేఘమును జూడ నీ వొక నాఁ డాటవిడుపిచ్చితివి, ఎల్లప్పుడు నెల్లకడల నెన్ని వైచిత్ర్యములనో ప్రదర్శించు నాసృష్టి పుస్తకమునందలి విశేషాంశములు గ్రహింపవలె నన్న నెన్నినా ళ్లీవలయునో? యోజింపు" మని ప్రబోధించి, తిరోహితుం డయ్యె.

ఒజ్జలు భగవంతుని యాదేశముయొక్క పరమార్థమును

గ్రహించి తమ శిష్యులు నిజమైన విజ్ఞానమును సంపాదింపవలె నన్న నన్ని వాసరంబులూ సెలవులుగనే యుండదగు నని నమ్ముచు, సాధ్యమగునంతవఱకు సెలవులను స్వేచ్ఛను పిల్లల కిచ్చుచున్నారు. తాము క్రమక్రమముగా నొత్తిగిల్లుచున్నారు.

అందుచేతనే శనివారపాదివారపు సెలవులు, వేసంగి సెలవులు, శీతకట్టు సెలవులు, పరీక్ష సెలవులు, పండుగ సెలవులు పిల్లలకు దొఱకుచున్నవి.

సెలవు లూఱకయే వచ్చిన వనుకొనరాదు. భగవంతుని యాదేశమున వచ్చినవి. సృష్టికావ్యపఠనమునకై యొసంగఁ బడినవి.

---

# 3 తోటలో.



[సుందరమ్మ—సూర్యనారాయణ—ప్రవేశింతురు]

సుంద:—అన్నయ్యా! నీవు నన్ను తీసికొని వెళ్లకుండా తోటలోకి వెళ్లుచున్నావా? పోనీలే?

సూర్య:—నీవు నడువలే వమ్మా. లేకపోతే రోజూ తీసికొని వెళ్లియుందును.

సుంద:—నేను నడువలేనేం? కోరుకొండ తీర్థానికి నన్నెవరూ ఎత్తుకోకుండా నేను కొండెక్కాను. నడువలేనేం?



సూర్య:—మఱాలాఅయితే రా!

[ఇద్దఱును గలసి నడుతురు.]

సుంద:—ఇంకా ఎంతదూర ముంది తోట? అన్నయ్యా!

సూర్య:—అప్పుడే కాళ్లులాగుచున్నవా? యేమి! చెల్లాయి!

సుంద:—అబ్బే! లేదు. ఊఱకే అడిగాను.

సూర్య:—అదిగో! చూడు. చుట్టూ పెద్ద కంచె ఉంది.

సుంద:—కంచె అంటే.

సూర్య:—తోటలోనికి పొలములోనికి ఆవులు దూడలు పడకుండా, చుట్టూ రైతులు ముళ్లకంపలు వేయుదురు. అదీ కంచె అంటే.

సుంద:—అదా! కంచె ఉన్నా కనబడుతున్నాయి!

సూర్య:—ఏమి కనబడు చున్నవి?

సుంద:—కొబ్బరిచెట్లు మామిడిచెట్లు అన్నీని!

సూర్య:—ఆచెట్లే తోట.

సుంద:—అయితే ఎంతోదూరం లేదు. మఱి చుట్టూ కంచె ఉంటే లోపలకు మనం వెళ్ళ టెట్లు?

సూర్య!—ఇదిగో! ఇక్కడ దారి ఉంది. ఈతడక తీసికొని లోపలకు వెళ్ళవచ్చును.

సుంద:—చాల బాగుంది. అన్నయ్యా! తోట. ఇక్కడింత బాగుంటుంది కనుకనే నీవు రోజూ వస్తావు?

సూర్య:—చెల్లాయీ! మళ్ళీ తడక వేసినావా?

సుంద:—వెయ్యక పోతే?

సూర్య:— వెయ్యకపోతే దూడలు లోపలకు వచ్చును. చూడు. ఆ తడకకు తాడుంది. ఆతాడు గట్టిగా ప్రక్కనున్న కొయ్యకు ముడిపెట్టుము.

సుంద:—[అట్లు చేయును] అన్నయ్యా! ఈతోట ఎవరిది?

సూర్య:—మనదే. ఇతరు లైతే మనము వారి నడుగకుండ లోపల కింత స్వేచ్ఛగా రాలేము.

సుంద:—[చప్పుడు విని] అన్నయ్యా! ఆచప్పు డేమిటి?

సూర్య:—అదిగో! ఆకొబ్బరిచెట్టునుండి కొబ్బరికాయ పడింది.

సుంద:—అవును. తీసికొని రానా?

సూర్య:—తీసికొనిరా ఇసీ! డొలక.

సుంద:—వలిచి చూదామా?

సూర్య:—ఇది ఉడతకొట్టు. మంచికాయ తీయిస్తా. అప్పడూ!

[అప్పడు వచ్చుచుండును.]

సుంద:—అప్ప డెవరు?

సూర్య:—అప్పడు మన పాలేరులలో నొకడు. అత డెప్పుడూ మన యింటికి రాడు. ఈ తోటలోనే ఉండి ఎప్పుడూ ఈ మొక్కలకు నీళ్లు పోయుచుండును.

సుంద:—అప్పడికి అన్నం?



సూర్య:—ఇంటివద్దనుంచి ముంతతో అతని కొడుకు తెచ్చి పెట్టును.

[అప్పడు వచ్చును.]

అప్పడు:—ఎవరండీ అమ్మాయిగారు?

సూర్య:—మా చెల్లెలు. మంచి లేతకొబ్బరికాయలు రెండు తీయి.

అప్పడు:—చిత్తము! [అని బందముతో చెట్టెక్కును]

సుంద:—[చూస్తూ] వాని కాకాళ్ళ కాతాడెందుకు?

సూర్య:—ఆతాడే బందము. బంద ముండనియెడల క్రిందకు జారిపోవును.

సుంద:—అమ్మయ్యో! ఎంతపైకెక్కి పోయేడో!

సూర్య:—ఈలారా! కాయ నెత్తిమీద పడును.

[కాయ పడును. అప్పడు దిగి పోవును.]

సుంద:—[క్రింద పడ్డ కాయ తీయును.]

సూర్య:—ఏదీ నే నొలుస్తాను.

సుంద:—ఏలాగు ఒలుస్తావు?

సూర్య:—ఇదిగో గునపము. దీనితో నేలను త్రవ్వుదురు. ఇది యిట్లుపాతి, దీనిపై నొలువవచ్చును. చూడు! [అని ఒలుచును.]

సుంద:—ఆ! ఇది కొబ్బరికాయ. లోపల నీళ్లు గలగల మను చున్నవి.

సూర్య:—చెల్లాయీ! మళ్ళీ తడక వేసినావా?

సుంద:—వెయ్యక పోతే?

సూర్య:—వెయ్యకపోతే దూడలు లోపలకు వచ్చును. చూడు. ఆ తడకకు తాడుంది. ఆతాడు గట్టిగా పక్కనున్న కొయ్యకు ముడిపెట్టుము.

సుంద:—[అట్లు చేయును] అన్నయ్యా! ఈతోట ఎవరిది?

సూర్య:—మనదే. ఇతరుల దైతే మనము వారి నడుగకుండ లోపల కింత స్వేచ్ఛగా బోలేము.

సుంద:—[చప్పుడు విని] అన్నయ్యా! ఆచప్పు డేమిటి?

సూర్య:—అదిగో! ఆకొబ్బరిచెట్టునుండి కొబ్బరికాయ పడింది.

సుంద:—అవును. తీసికొని రానా?

సూర్య:—తీసికొనిరా ఇసీ! డొలక.

సుంద:—వలిచి చూదామా?

సూర్య:—ఇది ఉడతకొట్టు. మంచికాయ తీయిస్తా. అప్పడూ!

[అప్పడు వచ్చుచుండును.]

సుంద:—అప్ప డెవరు?

సూర్య:—అప్పడు మన పాలేరులలో నొకడు. అత డెప్పుడూ మన యింటికి రాడు. ఈ తోటలోనే ఉండి ఎప్పుడూ ఈ మొక్కలకు నీళ్లు పోయుచుండును.

సుంద:—అప్పడికి అన్నం?



సూర్య:—ఇంటివద్దనుంచి ముంతతో అతని కొడుకు తెచ్చి పెట్టును.

[అప్పడు వచ్చును.]

అప్పడు:—ఎవరండీ అమ్మాయిగారు?

సూర్య:—మా చెల్లెలు. మంచి లేతకొబ్బరికాయలు రెండు తీయి.

అప్పడు:—చిత్తము! [అని బందముతో చెట్టెక్కును]

సుంద:—[చూస్తూ] వాని కాకాళ్ళ కాత్రా డెందుకు?

సూర్య:—ఆత్రాడే బందము. బంద ముండనియెడల క్రిందకు జాఱిపోవును.

సుంద:—అమ్మయ్యో! ఎంతపై కెక్కి పోయేడో!

సూర్య:—ఈలారా! కాయ నెత్తిమీద పడును.

[కాయ పడును. అప్పడు దిగి పోవును.]

సుంద:—[క్రింద పడ్డ కాయ తీయును.]

సూర్య:—ఏదీ నే నొలుస్తాను.

సుంద:—ఏలాగు ఒలుస్తావు?

సూర్య:—ఇదిగో గునపము. దీనితో నేలను త్రవ్వుదురు. ఇది యిట్లుపాతి, దీనిపై నొలువవచ్చును. చూడు! [అని ఒలుచును.]

సుంద:—ఆ! ఇది కొబ్బరికాయ. లోపల నీళ్లు గలగల మను చున్నవి.

సూర్య:—అదీ కొబ్బరికాయే.

సుంద:—కాదు. ఉడుతకొట్టు.

సూర్య:—నీళ్లు త్రాగుతావా?

సుంద:—ఏలా? పంచపాత్రి వద్దూ?

సూర్య:—చూడు [అని కాయకు తొలపొడుచును]

సుంద:—తెలిసింది. ఉడుతకూడా ఈలా తొలపొడిచి నీళ్లు తాగేసిందన్నమాట. [అని నీళ్లు త్రాగును.] మఱి యిది కొబ్బరిచెట్టు. అది?

సూర్య:—అది తాడిచెట్టు. అదికూడ కొబ్బరిచెట్టువలె పొడుగుగా నెదిగి పైకి వెళ్లి అక్కడ మట్టలు వేయును. ఆ చెట్టునుండి మనకు ముంజెలు వచ్చును. అదిగో! ఆ చెట్టు చూచితివా! అది మామిడిచెట్టు.

సుంద:—ఎఱుగుదును. మామిడాకులు తోరణం కట్టుకుంటాము. మామిడిపళ్లు తింటాము. ఆవకాయ పెచ్చు. మాగాయి పచ్చడి.

సూర్య:—చాల్లే! నోరూరి పోతుంది. అదో?

సుంద:—ఏమో!

సూర్య:—పనసచెట్టు.

సుంద:—తండ్రి గరగర తల్లి పీచుపీచూ! అదా!

సూర్య:—ఈవేళ కింకింటికి పోదాం.



సుంద:—ఒక్కపువ్వూ కోసుకోకుండానే?

సూర్య:—ఇదంతా పళ్లతోట.

సుంద:—నేను పువ్వులతోట వేస్తాను.

సూర్య:—అంతా నవ్వుతారు!

సుంద:—ఎందుకు నవ్వుతారు?

సూర్య:—పువ్వులు రాలి పోతాయి. పువ్వులు వాడిపోతాయి వాడు పూలు, రాలుపూలు ఎందుకూ పనికిరావు.

సుంద:—ఎందుకు రాలిపోతాయి? నాతలలో పెట్టుకుంటే ఎందుకు రాలిపోతాయి? రాలిపోవు. ఎందుకు రాలి పోతాయి? నున్నగా దువ్వుకొని నా తలలో గుచ్చుకుంటే ఎందుకు వాడిపోతాయి? వాడిపోవు.

[నిష్క్రమింతురు.]

---

# 4 వసంతుని భాగవతము.



తెరలో:—కూ! ఊ! కూ! ఊ!

వసంతుఁడు:—ఎవరు తెరలో?

కోకిల వేషము ఈవలకు వచ్చి |

కోకిలాన్నీ! కోకిలాన్నీ!
కన్నులకుఁ గనబడక యుందును;
ఒగరుచిగురుల సొగసు తిందును;
కూ! ఊ! యంచును కూసికొందును.

తెరలో:—రాముడూ! రాముడూ!

వసంతుడు:—ఎవరు తెరలో?

| | |
|---|---|
| రామ చిలుక వేషము ఈవలకు వచ్చి | చిలుకనే! రామచిలుకనే!<br>చెట్టునకు జెట్టునకు నెగురుచు<br>తీయమామిడి పండ్లు తిందును.<br>రామరామా యనుచు నుందును. |

తెరలో:—[ఆకుల గలగల]

వసంతుడు:—ఎవరా తెరలో?

| | |
|---|---|
| మామిడిచెట్టు వేషము ఈవలకు వచ్చి | చెట్టునూ! మామిడిచెట్టునూ!<br>చిలవలను పలవలను బలిసి,<br>పిందె, కాయ, పండు, గాసి,<br>యందఱకు నాహ్లాద మిచ్చుదును. |

తెరలో:—[సువాసన]

వసంతుడు:—ఎవరా తెరలో!

| | |
|---|---|
| మల్లెతీగ వేషము ఈవలకు వచ్చి | పువ్వునే! మల్లెపువ్వునే!<br>మల్లెపందిరి నుల్లసిల్లుచు<br>మంచివాసన గొట్టుచుందును<br>నిండుగా మెడ దండ నగుదును. |

వసంతుడు:— ఓహోహో! మల్లెతీగా! నాకొక దండ యిమ్ము.
ఓహోహో! మామిడిచెట్టా! నాకొక పండొసంగు.
చిలుకా! నాకెడమ తట్టుండి రామా! అను.
కోయిలా! నాకుఁ గుడితట్టుండి కూ! ఊ! అను.



అందఱును:—మీ రెవరు సామీ!

వసంతుడు:—నే వసంతుఁడ! నే వసంతుఁడ!

చైత్రవైశాఖములయందున,
సంచరింతు వసంతఋతువన.
నాకు నూపిరి పైరుగాలి;
నాకు లేదూ తోటమాలి.

అందఱును: మాకు నూపిరి పైరుగాలి;
మాకు లేదూ తోటమాలి.

[అని గంతులు వేసి ఆడుదురు.]

[తెర పడును.]

---

# 5. నందిని—ఆనందుఁడు.



వేప్రిపల్లెయను పల్లెలోఁ జాలమంది గొల్లలు, కాపులు, కమ్మవారును గలరు. వారిలో ఆవు లేని వా రెవ్వరూ లేరు. ఒక్కొక్కరింట నాలుగేసి, యైదేసి, పదేసి ఆవులుకూడ గలవు.

ఆయూరిలోని కొక పేదరైతు ఒక పల్లెనుండి క్రొత్తగా కాపురము వచ్చి, యిల్లూ, వాకిలీ ఏర్పఱుచుకొని, ఒకకొండ్రి గణించి, యెన్నినాళ్లనుండియో యొకమంచి యావును సంపాదించుకొందమని పాపము! తలక్రిందుగ నాలోచించువాఁడు.

తుద కొకనాఁ డాయూరి సంత కొక పడమటావు అమ్మకమునకు వచ్చెను. ఆ ఆవును చూచిన తోడనే యా రైతునకు దానిని కొనుక్కొనవలయు నని బుద్ధిపుట్టెను. బుద్ధి పుట్టినది. కాని సమయమున కారైతునొద్ద డబ్బేది? లేదు.

అప్పు డారైతు తనకుఁ దెలిసిన యొక కోమటిసెట్టి కడకుఁ బోయి "సెట్టీ! మంచి ఆవు అమ్మకమునకు వచ్చినది. నాకు కొనిపెడుదూ? అని యడిగెను. సెట్టియు "కొనిపెట్టిన నా కేమి లాభ" మనెను. రైతు "ఆవు ఈనిన తరువాత పాలు నీకు చెఱిసగముగ నిచ్చుచుందు. ఈలోపున నీవు ఇచ్చిన డబ్బు క్రింద నేను దానిని ఈను పర్యంతము నా ఱెక్కల కష్టము మీఁద మేపెదను. సాపాలు వడ్డీ" అనెను.

అందునకు సెట్టి సరే యని, యాయావును తానునూ బోయి చూచి వెలయిచ్చి రైతువెంటఁ దోలిపెట్టెను. ఆవు నారైతు తన పొలములోఁ గట్టియుంచి ఏపొద్దూ చిట్టు, తవుడు కుడితి, పోసి చాల సంరక్షణ చేసెను. సెట్టియు నాయావునకు బంగారవు మువ్వలు, బంగారవు గొమ్ములు చేయించి పెట్టెను.



మఱి రెన్నెలలకు ఆవు ఈనెను. దానికొక చక్కని కోడెదూడ కలిగినది.

ఇఁక నక్కడినుండి రైతు ఆవును పొలమునుండి తన యింటికిఁ దోలుకొని పోదు ననీ, సెట్టి తన యింటియొద్ద ఆ వుండవలె ననీ వాదులాటకుఁదిగిరి. "ఆవు నాది. నే కొని యిచ్చితిని. నేను బంగారవుఁ మువ్వలూ, బంగారవు గొమ్ములూ చేయించితి" నని సెట్టి—"ఇదేమి కర్మము! నేను ముప్పొద్దులా చిట్టూ పొట్టూ పెట్టి శ్రమపడి మేపితిని. నాకు పదిమంది పిల్ల లున్నారు. వారు దీని పాలూ పెరుగూ త్రాగి యీ దూడతో ఆడుకొందురని గంపెడాస నుంటె. పోవోయి! పుల్లయ్య! ఈఆవు నీకెట్లువచ్చు" నని రైతు—మాటా మాటా అనుకొని తగవు పడిరి.

ఇట్లు తగవుపడి వారిలోవారి కాతగవు తెగమి నిరువురును ఆయూరిలో నున్న నందు డను రాజుకడకు వెళ్ళి తగవు దీర్పు మనిరి. ఆరాజు "ఓయి! సెట్టీ! ఓయి! రైతూ! మీ యిరువురియందు నెవరి మీఁద ఆ ఆవునకు నెక్కుడు ప్రేమ యుండునో వారికి దాని నిప్పించెదను. సరియేనా?" అని యడిగెను.

ఇరువురు నంగీకరించి నట్లు బుఱ్ఱలు త్రిప్పిరి. త్రిప్పి వెంటనే సెట్టి "సరే! నేను పైడిమువ్వలూ భమిడికొమ్ములూ

"చేయించి ఆవా! నీకుంచినాను. నా వెంట రావా?" అనుచు ఆవు కొమ్ము పట్టుకొనెను. అది కొమ్ము విసరెను. సెట్టి అంతదూరము తభీ మని పడెను.

రైతు "నేను నిన్ను చిట్టూ పొట్టూ పెట్టి పోషించినాను. ఏమే ఆవు! నా వెంటరావు?" అని గంగడోలు దువ్వి తనచేతిలో జిట్టుతట్ట నుంచుకొని పిలచెను. ఆ వా రైతు వెనుకనే వెళ్లెను. దూడ ఆవు ననుసరించెను.

నందుఁ డప్పు డా రైతున కాయావునందు గల మమకారమునకు జాల సంతోషించి సెట్టితో "ఓ! సెట్టీ! ఆ రైతు నింక డబ్బుకొఱకు భాధపెట్టకు. ఇదిగో! నేటివఱకు నీకు రావలసిన వడ్డితోకూడ నీ సొమ్ము నే నిచ్చి వేయుచున్నాను. తీసికో" అని సెట్టిని సాగనంపెను.

రైతు రాజునకు దండము పెట్టి తన యింటి కాయావును దూడను తోలుకొని పోయెను. ఆవూ దూడా యింటికి వచ్చిన వని రైతు పిల్లలూ రైతు భార్యా యుప్పొంగిపోయి, తమ కవి నందుని దయవలన లభించినవగుట ఆవునకు "నందిని" యని, దూడకు "ఆనందుడు" అని పేర్లుంచిరి. నాటగోలె నింటిల్లి పాదీ జున్నూ పాలూ పెరుగూ నేయీ తాము భుజించుచు నిరుగు పొరుగు వారికిఁ బెట్టుచు సుఖముగ నుండిరి.

# 6 జయసింగు—జాతికుక్క.



జయసింగు అను నతఁడు ఒక మంచి జాతి కుక్కను బెంచెను. దాని కేవేళా యతఁడు మాంసపు ముక్కలను పాలను, ఆహారముగఁ బెట్టుచు వీధి యరుగుమీద నున్న ఒక గదిలో దానికి వలసిన పక్కమున్నగువాని నమర్చి యుంచు వాఁడు. ఒకనాఁడు జయసింగు రాత్రి కాలమందుఁ దన యూర భాగవత మాడుచుండఁ జూడఁబోయెను.

అప్పుడు కుక్క యింటియరుగుమీద కాపలా కాయుచుండెను. సింగు ఇంటికి వీధివైపు తాళము వైచుకొని వెళ్ళెను.

నడికిరేయి నిరువురు దొంగలు వచ్చి పెఱటివైపున జయసింగింటికి కన్నమువేసి లోపలఁ బ్రవేశించిరి. వీధి యరుగుపైనున్న కుక్క లోపల చప్పుడు విని, దొంగలు చొఱబడి రని పసిగట్టి, ఇంటిచుట్టును దిరిగి, దొంగలు గొట్టిన కన్నముగుండా దానును బెఱటి లోపలకు వెళ్లి చూచెను.

అప్పటి కప్పుడే మొదటి దొంగ ఒక చిన్న వస్తువుల మూటను దెచ్చి పెఱటివైపునున్న తిన్నెపైఁబెట్టి మఱొక మూటకొఱ కింటిలోపలకుఁ బఱుగెత్తెను. కుక్క ఆమూటను గిక్కురుమనకుండఁ దన నోటఁ గఱచుకొని కంతగుండా చుట్టు

తిరిగి వీథిలోనికిఁ వచ్చి ఆమూటను తన గదిలో బదిల పఱచెను. పదిలపఱచి తిరిగి యింకను దొంగ లేమి చేయుచున్నారో యని వెనుకటివలెఁ బెఱటి లోపలకు వెళ్ళి చూచెను. అప్పటికి రెండవ దొంగ మఱొక మూటఁ బట్టుకొని వచ్చి పెఱటిలో వేఱొక తిన్నెపైఁ బెట్టుకొని లోపలకు వెళ్లెను. కుక్క ఆ మూటనుగూడ ముందటి మూటవలెనే తన గదిలోఁ బదిల పఱచెను. పదిల పఱచి తిరిగి వెళ్ళెను.

ఆసమయమున మొదటి దొంగ యీవలకు వచ్చి తా నంతకుత్రిత మక్కడ పెట్టుకొన్న మూటకొఱకు వెదకులాడు చుండెను. లేదు. లేకపోవుట తోడనే యతఁడు రెండవ దొంగ తీసియుండు నని వానితోఁ బోటలాడెను. రెండవవాఁడు తన మూటఁ జూచుకొని, అది లేమి, దానిని మొదటివాఁడు దీసె నని యనుకొని మొదటివానిని గద్దించెను.

ఇట్లు మూటలకొఱకు దొంగ లిద్దఱు తమలో దారు పెద్ద సేద్దు సేసికొనుచుండ, నిరుగుపొరుగు నున్న వారొక కొందఱు లేచివచ్చి యా దొంగలను బట్టుకొని జయసింగునకు వర్తమానము జేసిరి.

జయసింగు వచ్చి సంగతి తెలిసికొని తన యింటిలో నేమైన బోయెనేమో యని వెదకుకొనుచుండ, కుక్క తాను తీసి దాచిన రెండు మూటలను నోట గఱచుకొని వచ్చి తెచ్చి



తన యజమానుని ముందుబెట్టి యూఱక తోఁకాడించెను.

జయసింగునూ, ఊరివా రందఱునూ, ఆ కుక్కయొక్క విశ్వాసమునకు, నేర్పరితనమునకు చాల యచ్చెరువాటుఁ జెందిరి.

## 7 పంచ భూతములు.



పెద్దకాపొకనాఁడు చుట్టపు చూపుగా బొరుగూరు పోవుచుండెను. నడదారినే పొలాలడ్డుపడి నడుచుచున్నాడు. పెద్ద చెప్పులుజోడు కిఱ్ఱుమనిపిస్తూ, ములుకోలకఱ్ఱటక్కటిక్కు కొడుతూ, ముతక దొక్కా ముడతలు తీసికొంటూ, తట్టతల పాగా పైకి నెట్టుకుంటూ, తాటాకు గొడుగు బుజాన్ని త్రిప్పు కొంటూ, వెళ్లుచున్నాడు.

అతగాని గోటూ, నీటూ, భూదేవి, జలదేవత, గాలి దేవుడు, సూర్యభగవానుఁడు ఆకాశవాణి, చూచి, “ఇతగాడు పెద్దకాపులాగున్నాడు. ఇతనికి సొంతయూర బలుకుబడి సాగి నట్లే దారిలోకూడా సాగుతుందా? చూతముగాక వీనిగొప్ప” అని తమలోతా మనుకొని మొట్టమొదట భూదేవిని తనశక్తి చూపుమన్నారు.

భూదేవి తన సాయశక్తులా తంటాలు పడినది. దారిలో బ్రహ్మదండి మొలిపించింది. పక్కపక్కల నింతింత పుట్టలు పోసి, ఆ పుట్టల కలుగులలోనుండి కోడెత్రాచులను బుస్సుమనిపించింది. రాళ్లడ్డము పెట్టింది. కాని భూమిని దున్నే రైతునకవన్నీ అడ్డంకులా? చెప్పులతో ముళ్లు తుక్కుతుక్కయ్యేటట్టు త్రొక్కేశాడు. కఱ్ఱ తిరగేసి పాముల బుఱ్ఱల చితుకగొట్టినాడు. రాళ్లు తప్పించుకొని నడువసాగినాడు.

అప్పుడు భూదేవి తన వల్లగాదని, జలదేవతను బురికొలిపినది. వెంటనే జలదేవత యొకయేరు రూపముతో ఆ కాపునకు అడ్డువచ్చినది. రైతు జోళ్లుతీసి చేతబట్టుకొని అట్టే నీళ్ళల్లో దిగినాడు. దిగీదిగుటలో బుఱదలోనున్న తుమ్మముల్లొకటి కసుక్కున కాలిలో భూదేవి గ్రుచ్చింది. దానితో "అమ్మో" అని కఱ్ఱ నానుకొంటూ, కుంటుకుంటూ, లోతు చూచుకుంటూ ఆనీళ్ళు దాటాడు.

ఇఁక జలదేవత తన వలన గాదనీ, కఱ్ఱ సాయమున్నంత వఱకు తనలోతు గ్రహిస్తూ రైతు నడచిపోతాడనీ, గాలిదేవుని కదలించింది.

గాలిదేవుఁడు పెద్దవిసరు విసరి, మబ్బు గ్రమ్మినట్లు చేసి వడగండ్ల వాన గురిసినాడు. ఆ గాలివానకు కాపు గొడుగూగిసలాడి పోయింది. ఆ వడగండ్ల దెబ్బలకు తూట్లుపడింది.



కాని కాపు గొడుగు వీడలేదు. వీడలేదు సరికదా! కాపు తన చేతిలోని దుడ్డుకఱ్ఱ నేలనుపాతి, తలపాగా గుడ్డతో ఆ గొడుగు నాకఱ్ఱకుగట్టి దానిక్రింద కూర్చున్నాడు. గాలిదేవుఁడిఁక నేమీ చేయలేక పోయినాఁడు. "సూర్యభగవానుఁడా నీవొకచూపు చూడవోయి" అన్నాఁడు.

సూర్యభగవానుఁడు తెరవిప్పి నల్లెండగాశాడు. ఆయెండ కలసట, చెమ్మట, గలిగి రైతు తన తొడిగిన చొక్కాయి దీసి యాలాగునే గొడుగుక్రింద కూర్చున్నాఁడు. ఎంతయెండ గాసినను గొడు గట్లే యున్నది. అప్పుడు భూదేవి, జలదేవత గాలిదేవుడు, సూర్యభగవానుడు, నలుగురూ కూడి ఆకాశవాణి యొద్దకు వెళ్ళి "మే మందఱమును జాలకష్టపడి, జోడూ, కఱ్ఱా చొక్కా, పాగా తీయించినాము. గొడుగు తీయించలేకపోయినాము. అది నీ వంతన్నారు. అప్పుడాకాశవాణి యన్నది. "గొడుగు సామాన్యమైనది కాదు. అది నెత్తిమీద ఉండును చేతిలో నిలుచును. ఎండకునూ వానకునూ లొంగదు. అయినఁ జూచెద" నని యనియెను. మీ రందఱును సాయపడవలెను నాయొక్కతెవల్ల కాదని" కూడఁ దెలియఁ బల్కెను.

భూదేవిని మంచిపచ్చిక మొలిపించమంది. జలదేవతను ద్రావుటకు తియ్యని సెలయేరు తార్చమంది. గాలిదేవుని చల్లనిగాలికూన లంపమంది. సూర్యభగవానుని యాపై క్రిం

కుతూ నెఱ్ఱెఱ్ఱగా సంధ్యారాగము గప్పుమంది. తా నప్పుడు నిర్మలమైన నీలముతో, నీటైన చుక్కలతో పైని విలసిల్లింది.

పెద్దకా పదియెల్లనుచూచి యిట్లనుకొన్నాడు. "ఓహో పొద్దుకునుకుచున్నది. ఇక వాన రాదు. మబ్బు పోయినది. ఆకాశము నిర్మలముగనున్నది. చుక్క లున్నవి. చాలు. బాట చక్కగ నున్నది." అని కడ నున్న సెలయేటి నుదక మింతఁ ద్రావి దప్పి కార్చుకొని, తిరిగి పయన మయ్యెను.

పయన మగుచు ని ట్లూహించెను. "పోవునది చుట్టా లింటికి. ఈచింకిగొడుగు చూచిన వారు నవ్వుదురు." అని యాగొడుగును పాఱవేసెను. గాలి కది, యతనిది కానట్లు దొర్లుకొనుచు నెటకో పోయెను. ఇఁక చొక్కా, తలగుడ్డా చెప్పులుజోడూ, చేతికఱ్ఱ ఉన్నవి. ఒడలు చెమటూఱ నతనికి జల్లనిగాలి కావలసి వచ్చుటచే చొక్కాయినిఁ దలగుడ్డకు జుట్టి చంకఁ బెట్టుకొనెను. కొంతదూరము నడువఁ జోడు బాడయి కిఱ్ఱు సడలుటఁ దెలిసికొనెను. కిఱ్ఱులేని జోడు నీడ్వ నేటికని కానంతదూరము చేతఁ బట్టుకొని, ఊరుచేరుగడఁ జేత బట్టు కొనుటకంటె కఱ్ఱకు దగిలించుకొంట మేలని దానిని తన చేతి కఱ్ఱకు దగిలించుకొని, రెండునూ వెనుబుజము నునుచుకొని గుట్టుగాఁ జీకటిరాత్రిఁ నిదురవేళకు జుట్టముల యింటిపట్టుఁ గన గ్గొనెను. చెప్పుల కిఱ్ఱులేదు. కఱ్ఱ టక్కు టిక్కు లేదు.



చొక్కా నీటులేదు. తలపాగ గోటులేదు. గొడుగు లేదు. గోష్ఠి లేదు. పెద్దకాపుగారికి—

---

# 8 చతురంగ బలము.



ఒకానొక దేశములో నొక రాజుగారికి, మంచి యాలోచన చెప్పు మంత్రి, చక్కని పట్టపేనుగు, వడిగల సవారిగుఱ్ఱము ఎత్తైన రథము, నమ్మకమైన బంటు ఉండిరి.

ఒకనా డేనుగు, గుఱ్ఱము, రథము, బంటు, తమలో తాము పరస్పర మొకరికంటె నొకరు గొప్పవార మని తగవు పెట్టుకొనిరి.

పట్టపేనుగు "నేను మహారాజులుంగారిని అంబారీలో గూర్చుండబెట్టుకొని యూరంతా యూరేగిస్తా నన్నది." సవారి గుఱ్ఱము "నేను మహారాజులుంగారిని నావీపుమీఁ దెక్కించుకొని షికారు తీసికొని వెళ్లెద" నన్నది. ఎత్తైన రథము "ఓహో! నాలో మహారాజులుంగా రాసీనులై యుద్ధభూమిని విజయ మందుతా" రన్నది. నమ్మకమైన బంటు "నేను కత్తి చేతఁబట్టి ముందున్న చాలు! మహారాజులుంగారికి వేఱే శ్రమ లే" దన్నాఁడు. ఈ తగవు రాజుగారి కడ కేలాగో వెళ్లినది.

మంత్రిని రావించి, యోజించి, రాజుగా రప్పుడొక చోట పల్లపువాలునే పెద్దముత్యాలకుప్ప వోయించి, ఏనుగునూ గుఱ్ఱమునూ, రథమునూ, బంటునూ, రమ్మని "మీలో నెవ్వరు ముందుపోయి యమ్ముత్యాలపోగు నంతను తెచ్చిపెట్టువా"రని కోరెను.

అప్పుడు గుఱ్ఱము ముందుగ మూఁడుడాములు మీఁద ఆ ముత్యాలకుప్ప దగ్గఱకుఁ జేరెను. కాని ఆ ముత్యాలపోగు నెట్లు తీసికొని రాగలదు? ఇటునటు చూచి డెక్కలతోఁ జింది చింది, "అయ్యయ్యో! ముత్యముల నన్నింటి నెవ్వరేని రెండు సంచుల నింపి నాపైని నొక సంచి యొక సంచి పడ వైచిన నిట్టె కొనిపోయియుందు"నని యనుకొనుచు కార్యము గానక చిన్నవోయెను. ఆ వెనుకనే యేనుఁగు, మునుముందు గుఱ్ఱము జనియు గార్యసిద్ధిగనమి తనదే విజయమని, పెద్దపెద్ద అంజల దొండమూడించు కొనుచు శరీర మంతయుఁ దూగాడ నమ్ముత్యాల పోగును డాసెను. డాసినదే కాని అదిమాత్రము వానిని తీసికొనిరాగలదా? లేదు. ఆ ముత్యముల నట్టె తన తొండపు గొంకితో నొకటి రెండింటి నెత్తి తన వీపుమీద వైచు కొనెను. అవి దొర్లి పడిపోయెను. "అయ్యో! ఈముత్యముల నన్నింటి నెవ్వరేని మూటగా గట్టిపెట్టిన నాతొండపుఁ గొనకది తగిలించుకొని, మహారాజులుంగారి మోలినుంచి యుందు;



ఎందు" కని విన్నబోయెను.

అంతలో బంటు దగ్గఱి, తన దోసిట దోసెడు ముత్యము లెత్తగల్గెను. మఱి ఏరలేక పోయెను. "అయ్యో! ఇట్టి వింకను పది చేతులున్న బాగుండి యుండెడినే" యనుచు ఖిన్నుఁ డయ్యెను. రథ మావెను వెనుకనే పల్లపువాలునే దొర్లు కొనుచు సమీపించి, "నాకు కాళ్లు లేవు, చేతులు లేవు, తొండము లేదు, ముట్టె లేదు, నేనేల తగుదు నని యిటకు వచ్చితి. కట్టా! యెవ్వరేని నాలో వీని నన్నింటి నెత్తిపోసిన"—అని మఱేమి తోఁచియో అర్థోక్తి నాగిపోయెను. ఎగుదారి కెక్క వేయు టెట్లని కాబోలు.

పై నలుగురి వలనను బనిగామి మంత్రి చూచి, మందస్మితుం డగుచు ముత్యాలపోగు కడకు వచ్చి, ఆ బంటుచేత దోసిళ్లకొలఁది ముత్యముల నన్నింటిని రథములోఁ బోయించి "రథమా! నీయంతన నీవు మెఱక కెక్కలేవు" అని, గుఱ్ఱమును దానికిఁ గట్టి, "గుఱ్ఱమా! నీ వింత బరువు లాగలేవు" అని వెనుకనుండి ఏనుగును "తొండముతో త్రోయు" మని బంటు ముందును తాను పిఱుందను వానిం గాచికొనుచు నా ముత్యములకుప్ప నంతను రాజుగారి కొప్పగించెను.

ఏనుగు, గుఱ్ఱము, రథము, బంటు, లోలో గ్రహించి కొన్నారు, ఒకరికంటె ఒకరు గొప్పవారు కారని. నాటఁ

గోలె వాదిలో వారు తగవు మాని రాజునకైకమత్యత మతిం తగ సాయపడి రాజునకుఁ గీర్తి దెచ్చుచు మంత్రికి మాట దక్కించుచు తాము సుఖపడి ప్రజలను సుఖపెట్టిరి.

---

## 9 చిలుక చెఱ.



అగ్గిరాముఁడను నొకచెడ్డపిల్లవాఁడు ఒక చిలుకను పట్టుకొని పంజఱములో నుంచెను. ఒకనాఁ డా చిలుక "రాముఁడూ! రాముఁడూ!" అని పిలచెను. పిలచిన తోడనే తన్నేమో యనుకొని యాపిల్లవాఁడు "ఎందుకూ" అని దగ్గఱకు వెళ్ళెను. "నిన్నెవరు పిలిచినారు నీతిమాలిన కుక్కా! చెట్టుమీద నాజోడు రామచిలుక యున్నది. అడవిలో నే దిను రామాఫల మున్నది. ప్రతియూరిలో నేవ్రాలు రామకోవెల యున్నది. భద్రాద్రిలో నే సేవించు రాములవారి గుడి యున్నది. యాత్రచేసే రామేశ్వర మున్నది. స్నానము చేసే రామగుండ మున్నది. పారాయణముసేసే రామాయణ మున్నది. జపముచేసే రామమంత్ర మున్నది. భజనసేసే రామకీర్తన మున్నది. నన్ను చెఱతప్పించే మంచి పిల్లవాఁడు శ్రీరాముఁడీలోపలనే యున్నాఁడు. నిన్నెవరు పిలిచినారు నీతిమాలిన కుక్కా!" అని అనెను.



అనుసరి "కా మంచి పిల్లవాఁడేడీ?" అని చూడ నిస్తే చెడ్డ పిల్లవాఁడు పంజఱము తలుపుతీసెను. "నీవే యామంచి పిల్లవాఁడవు నాశ్రీరాముఁడ" వనుచూ చిలుక తుఱ్ఱోమని యెగిరి పోయెను.

---

## 10 రంగని ముఱికి.



రంగడు సహజముగ చక్కని పిల్లవాఁడు. కాని ఎప్పైకన మొక్కవ. ఒకనాఁ డతఁడు తన ముఱికిని తాను జూచుకొనక తాను చాల అందమైనవాడ నని విఱ్ఱవీగుచు దారిమేయు ఆవు నొద్దకు వెళ్లి "ఆవా! నాయందము నీలో నున్నదా? నన్ను చూడు" మనెను. ఆవు తన కొమ్ములాడించుకొనుచు "నా యందము నాది, నీయందము నీది. నీయందము నాలో నెట్లుండును? మహా బాగున్నావు. చింపితల, మసిమొగము, మట్టిచేతులు, మాసినచొక్కా" అని హేళనము జేసెను. ఆవు మంచిదికాదని యతఁడు వాకిటఁగల కుక్కయొద్దకు వెడలి "కుక్కా! నా యందము నీలో నున్నదా? నన్ను చూడు" మనెను. కుక్క తన తోక జాడించుచు, "నా యందము నాది. నీయందము నీది. నీ యందము నాలో నెట్లుండును?

మహాబాగున్నావు. చింపితల, మసిమొగము, మట్టిచేతులు, మాసినచొక్కా" అని పరిహాసము చేసెను. కుక్క మంచిది కాదని మదురుమీద నున్న పిల్లిని బిలచి, "పిల్లీ! నాయందము నీలో నున్నదా?" యని యడిగెను. పిల్లి తన తలద్రిప్పుచు "నీయందము నీది నాయందము నాది. మహాబాగున్నావు. మట్టిచేతులు, చింపితల, మాసినచొక్కా, మసిమొగము" అని వెక్కిరించెను.

ఇఁక రంగనికి లోకమందు మంచివారెవ్వరగపడక తన తల్లిదగ్గఱకు జని, "అమ్మా! అమ్మా! నాయందము నీలో నున్నదా?" అని యడిగెను: తల్లి "కన్నతండ్రీ! నీ యందము నాలో నుండక మఱెచ్చటుండు" అని రంగని రెండు మట్టిచేతుల నట్టె పైకెగురఁబట్టి, ఆ రెండుచేతులను తన తల పైని రాయునట్లు చేసికొనుచు తన బుగ్గను బిడ్డబుగ్గల నూఱక రాసికొనఁ జొచ్చెను.

తల్లి మొగమంతయు మసి యయ్యెను, తల్లి ముంగురులన్నియు మట్టితో నిండిపోయెను.

రంగడు వెంటనే "అమ్మా! నీమొగమంతయు మసిగానున్నది. నీతలనిండ మట్టియే. బాగులే" వనెను. తల్లి తనయుని లాలించుచు "చిట్టితండ్రీ! అదేనోయి! నీయందము. అదేనోయి! నీయందము" అనెను.

రంగఁడు సిగ్గువడి యెడ్డెతనము విడిచెను.

# 11 మృగరాజు రాజనీతి.



అడవిలో నొకనాఁడు సింహమూ పెద్దపులీ రెండునూ గలసి తమలోఁ దా మొకవిందు నేర్పాటుచేసికొని యొకపెద్ద టేకిమ్రానుక్రింద నాహారపదార్థాలు సమకూర్చుకొని యాసీనము లయ్యెను. సింహమేమైన మదపుటేనుగుల కుంభస్థలములు చీల్చి తెచ్చిపెట్టి యందునుండి పచ్చినెత్తురుబొంట్లు నచ్చంపు ముత్యాలు జాఱిపడ నువ్విళ్లూఱ దొడంగె. పెద్దపులియేమైన చింబోతుల నెనుబోతుల నెక్కడున్న లేళ్ల లెక్కకు మిక్కిలి వేటాడి తీసికొనివచ్చి యెప్పుడు తినడ మని తహతహపడ దొడంగె.

ఈవిధి నవి రెండును, పరిషేచన తరువాయిగ బ్రాహ్మణులు వడ్డించిన విస్తళ్లముం దున్నట్లు ఉండడ మెక్కడినుండియో యొకనక్క సూచి, యది సెడగొట్టు తలంపుతో నూరిలోపలకు బోయి, యొకపిల్లిని బురికొల్పి పంపినది.

పిల్లి వెనువెనుకనే మృగరాజునకు శార్దూలమునకు మధ్యగావచ్చి, "మీ రిద్దఱునూ నాజాతికిఁ జెందినవారు! నేను మీకు మూలవిరాట్టును నన్ను సహపంక్తికిఁ బిలువమి మీకు బాగున్నదా?" అని చెప్పినది. ఆమాట విని సింహమన్నది

"ఇప్పుడు మాత్రము మించినదేమి యీలాగు వ్యాఘ్రేశ్వరున కావలగా గూర్చుండు" మన్నది. అనఁగనే మార్జాలము కినిసి వ్యాఘ్రేశ్వరునకుఁ గ్రిందకాదు. పంచాస్యునకు మీఁదుగఁ గూర్చుందు నని, సింహమును మించి యెత్తగు పీఠమున దానికి గుడితట్టుగ వైచికొని యాసీనమయ్యెను. అదిచూచి శార్దూలమట్టై తన పంజానెత్తి "నీకు సహపంక్తి భోజనము ప్రాప్తిలేదు. చపేటలు, ప్రాప్తి"యని గాండ్రించి మొగము చిట్లించి కోఱలు వెలికిజూపి మీసములు సూదులవలె గగురించెను. దానితోఁ బిల్లి తోఁక ముణిచినట్లై ముణిచి యొక్క యుడామున లేకి చెట్టు కొన కెక్కి యా ముప్వన్నె మెకమును వెక్కిఱింప సాగెను. పాపము! పెద్దపులి చెట్టెక్కలేదు. దాని వెక్కిఱింపు సూడ నుడుకుమోతుతనము వచ్చుచున్నది. ఏమిచేయఁ గలదు? ఊఱకే చెట్టుచుట్టు ప్రదక్షిణము సేయసాగెను. పైనున్న పిల్లి కా చెట్టుమీఁద నెవో పక్షిగుడ్లు దొఱికినవి. అవి తినుచు మఱింతగ నపహాస్యము చేసినది. "పైనున్నవారు రాజులు క్రిందున్నవారు కోతులు" నని. ఆ పలుకు వినినదిగ సింహమునకుగూడ నొడలు మండెను గాని సింహము మాత్రము చెట్టెక్కఁ గలదా? ఎక్కలేదు. అంతియకాక వేటాడి తెచ్చికొనిన మెకాలయొక్క వేడి నెత్తురు చల్లాఱిపోవుచున్నది.

అందుచే సింగ మదంవయు యోజించి, "దానికి శాస్తి



నేఁ జేయుదు. రా." అని పులిని వెనుకకుఁ బిలచి, పిల్లిని చెట్టు దిగు మని "అందఱికందఱునూ సమానులే, ఒకజాతి వారము మనలో మనకుఁ దారతమ్యము మొదటనే యుండరాదు. మన జగడము వలన పదార్థములు పాడగుచున్నవి. మీరందఱూ నన్ను రాజన రాజు నగుచున్నాను. కానన్న కాను. మనము ముప్వురమూ వలయాకారముగఁ గూర్చుండి సంబార మెల్ల నడుమ నుంచుకొని భుజింతము" అని యన్నది.

వల్లె యని పిల్లి యన నప్పు డమ్మూఁడును వలయాకారముగఁ గూరుచున్నవి. ఆరగింతమూ అని సింహ మొక యేనుగుతలను పెద్దపులి యొక యెనుబోతు తొడను ఫలాహార మట్లు మెసవ మొదలిడినవి. కటకటా! పిల్లి వాని నెప్పుడును తినియుండలేదు. టక్కులు పన్ని కలుగులు కాసి యెలుకల బట్టుటయే దాని కలవాటు. అందుచే దిక్కులుచూడ మొదలు పెట్టినది. ఎందుకు వచ్చితి నీ పిలుపని పేరంటమున" కని తనలోఁ దాను సిగ్గుపడఁ జొచ్చినది.

అప్పు డక్కడకు నక్క ఆదిని పిల్లిని బురిగొల్పి పంపిన నక్క యా నక్కే వచ్చి, "ఈ మూఁడును దెబ్బలాడుకొనున వని యనుకొంటి. దెబ్బలాడుకొని యుండిన యా సందడిని ఆ వేటాడి తెచ్చినవి నాకు దక్కు ననుకొంటిని, సాగినదికాదు, నాయెత్తు" అని దూరదూరముగా నాగి "బిడాలమాన్యమా!

ఏ మిమ్మ్రడుతూమిడుతూ చూచుచున్నావు. ఏనుగు మెదడు నంజుడు నీమొగానికి తిరిగి దొరుకుతుందోయి" యని యన్నది. అది విని యదేవంకగ బిడాలము, నక్క తనకోసము వచ్చిన దని సెల విప్పించు డని పెద్దపులినుండి సింగమునుండి సెలవు దీసికొని మిక్కిలి క్రించుదనముతో నక్కను గలిసికొన్నది.

పెద్దపులీ సింగమూ ఆజిత్తులమారిక్షుద్ర జంతువుల వైపు చూడనేలేదు. అవి యనుకొను మాటలు విననేలేదు. ఆ అడవిలో స్వేచ్ఛగా బలముగా పెఱిగి, కాయ కష్టముమీద నెమకి నెమకి పెద్దపెద్ద జంతువులను వేటాడి తెచ్చుకొని హాయిగాఁ దినుచున్న సింగమూ పులీ ఎక్కడ, కపట జీవాలు నిస్సత్తువసత్వములు, కడుపు కక్కుర్తివి నక్కా పిల్లీ యెక్కడ?

పిల్లి నక్కతో "నేనూ ఆజాతిదాననే, కాని నా బ్రదుకంతయు, నూర మనుష్యుల సహవాసమున బడి, పిల్లినైపోతిని. వానిని జూడడ మన్న సిగ్గగుచున్నది. పోయెద" నని వెడలి పోయినది. నక్క పిల్లికై "అడవిలోనుండి నే నేమంత గొప్ప బ్రదుకు బ్రదుకుచుంటి? అవితిని పారవేసిన దుమ్ములూ, నరాలూ, ప్రేవులూగా? మన అల్పత్వమునకు గారణ మూరనుంటా కాడవినుంటా కాదు. మన జిత్తులమారితనము. దాని నెప్పుడు విడిచి మనము మనజవ సత్తువులుచూపించి, మనపొట్టపోసికొన



గల్గుదుమో, యప్పుడు మనకు గౌరవము, గొప్ప, సమస్తము వచ్చు" నని పెద్దయుపన్యాస మిచ్చుచుఁ దన దారిని దా వెళ్లి పోయినది.

విందారగించిన వెనుక శార్దూలము గర్వించి తేంచి "పిల్లేది? మెల్లగా జారిపోయినదే? చావఁదన్ని పంపించి యుందును. నీమూలమున బ్రదికిపోయిన" దనెను. "పిల్లిని జంపిన బ్రహ్మహత్యతో సమానము. ఎప్పుడును జంపకు" మని సింగము పెద్దపులికి నీతి చెప్పెను. "అన్నము పున్నము నెఱింగి జంతుహింస సేయుదానవు గనుకనే నీవు మృగరాజువయితి" వని శార్దూలము గడుంగడు సింగమును గొనియాడెను.

ఇట్లు మంచిచెడ్డ లాడుకొనుచు నాటివిందును ముగించుకొని సింగము సింగము గుహకు పెద్దపులి పెద్దపులిగుహకు వెడలి పోయినవి.

---

## 12 హయహరిణోపాఖ్యానము.



అనాదిని దేవలోకమునకు శ్రీమహావిష్ణు వెట్టిండో ఆదిని భూలోకమునకు విక్రమార్కప్రభు వట్టిండు. "నావిష్ణుః

"పృథివీపతిః" అన్న లోకోక్తి యమ్మహారాజునుం బట్టియే వచ్చెను.

వీరనృపతి యతఁ డొకప్పు డొకంపమల్కై దూరదేశము జయింప సమకట్టి, కాలయాపనము గాకుండుటకై, కాలినడకను బోవుటకంటె, యేదేని వడిగల వాహన మెక్కి పోవుట సముచిత మని తలపోసెను. తలపోసి తన యమాత్యాదుల నెల్లఱను దనకు దగు వాహనమును నెమకి గొనిరం డని యనుమతించెను. అమాత్యాదులును జంతువులయొక్క సహజమగు వడిఁ దెలిసికొనుట కరణ్యమునం దవి యథేచ్ఛ నున్నప్పుడు చూడవలసియుండు నని మొదలఁ దలంచి, యందఱు నరణ్యమును గలయ వెదకిరి. ఆ వెదకుటలో వారి కెన్నెన్ని సత్త్వము లగపించినవో యాయగపించినవాని లెక్కకు మితి లేదు; మేఱ లేదు. కాని, యొక్కటియు నందు వారలకు నచ్చలేదు; వారలకే నచ్చనప్పుడు మహారాజులకడకుఁ గొంపోవు టెట్లు? పెద్దపులి, సింగము, చిఱుతపులి, సివంగి,—వానిని చూచునంత నవి గండు మొగంబులతో భీతిగొల్పు. మదపుటేనుంగును గొనిపో, దానికి గళాకళ ననుసరించి పిచ్చియెత్తు. అప్పట్టున దానిం బట్టఁ బగ్గంబులు గావు గదా యుక్కుగొలుసులుగూడఁ బనికిరావు. ఎద్దు, గద్ద, ఎలుక, చిలుక పురాణాలకు వాహనాలుగాని రాణాలకుఁ దగ వని యూహించినారు.



తుదకు విసిగి యొక సమస్థలంబు సేరి యందు విరామ మనుభవింప నందఱు సుఖాసీనులైరి. అప్పు డక్కడ వారి ముందొక పందెము జఱిగెను. లేడి యొకటి క్రొవ్వి కొమ్ములు మెలితిరిగి చిలవలు, పలవలు పెరిగి ఘోటకము నెదిర్చి "నా కంటె వడిగఁ బఱుగెత్తెదవా?" యని మెత్తిపొడిచి చెంగుచెంగున దాటి పోఁగడంగెను. "దాని నందుకో! చూతు" మని తక్కుంగల జంతువులు చేయివీవ, ఘోటక ముత్సహించి తన పాటవంబు కొలంది దానివెనుక నెగిరి పోవునట్లు పోవుచుండెను.

"ఈ రెండింటి నేదేని విక్రమార్కప్రభువరేణ్యులకు దగు" నని కట్టుపకాసు లా రెండింటిని రహి ముట్టి, పట్టి పట్టణంబునకు గొనిపోయి "రాజు లెప్పట్టున నున్నవారలు, వాహనంబులం గొనితెచ్చితి" మని కావలివాండ్ర నడిగిరి. "రాజు లిప్పుడే కొలువుకూటమును విడిచి, జైత్రయాత్రకు సంసిద్ధులగుచు మేడమీఁద మైమఱువు ధరించుచున్నార" లని కావలివాండ్రు విన్నవించిరి.

తిన్నగ సేనానాయకుఁడు మేడమీఁదకుఁ బోయి "స్వామీ! తమ కేది కావలసిన దానిఁ జిత్తగింపఁ బ్రార్థింతు. రెండింటిం గొనివచ్చితిమి. అం దొండు కొమ్ములు మెలితిరిగి, అందంపుమచ్చల నచ్చెఱువు గొల్పుచుఁ గండుకమా అన్నట్లు పఱుగెత్తు. మ ఱొండు మెడపై జూలుపోసికొని వింటిబద్దవంటి

జిగిగల నడుము జవజవ మన, టకటకా టకటకా డెక్కల చప్పుడు సేసికొనుచు దవుడుతీయు. "దేవర దివ్యచిత్తం బెద్దాని గణుతించిన నద్దానిం గొనఁజెల్లు" నని హెచ్చరించెను.

విక్రమార్కులు వెంటనే మేడ దిగి క్రిందికివచ్చి యందమైన హరిణముం దిలకించి దాని సొగసున కుబ్బి యారోహింప నట్టె దానినడు మొక్కసారి తట్టె. తట్టినంత లేడి పాపము! అణగి నేల మణగి పోయినది. గుఱ్ఱము సకిలించినది.

రాజప్పుడు గుఱ్ఱమువంకఁ దిరిగి గుఱ్ఱమును తట్టి యట్టె దానిమీద కెగసి కళ్ళెము బిగబట్టి రికాబులు ముట్టఁగ్రుచ్చెను. గ్రుచ్చుచు "కొమ్ములు మెలితిరుగుట లద్దాని కనవసరము. ఆ కొమ్ములు కోసివేసి విడిచి పుచ్చుడా. కూసు" నని లేడి నీన డించెను. గుఱ్ఱము మఱొకమాఱు సకిలించి, యొక్క యుడామున విక్రమార్కునితో పగవారి పట్టణంబు పొలిమేర నధిగమించి రాజునకు జయము, కరతలామలకంబుగ నొడగూర్చెను.

ఇక్కడ రాజభటులు లేడికి మెలితిరిగిన శృంగంబులను మొదటకంట దెగగోసి, "ఓసీ! తీఱి చక్కగ నొక్కయిక్క కుడిచి కూర్చుండ లేక, గుఱ్ఱము నెత్తిపొడిచి యక్కఱకు రాని పఱుగులెత్తి నందుల కనుభవింపు, మీ పరాభవం బని, యొక్క కొరడాదెబ్బ పిఱుంద నంటించి యంపివేసిరి. పిచ్చి



ముండకు లేడి కా పరాభవము భరింపనలవి గానిదై పోయినది. భూమిమీద నెక్కడేని తలదాచుకొందమన్న నంతటను గొమ్ములు మెలితిరిగిన తోడిలేడిపిండులే గాని మొండితల గల దొకండును గానరాదయ్యె. భూమండలమును విడిచి చంద్రమండలమునకుఁ జనజూచినది. కాని, చంద్రుని పొట్ట నున్న లేడికిఁగూడ కొమ్ము లున్నవి. కొమ్ములున్న లేడినే తిన మఱిగిన రాజునకు గొమ్ములులేని తా నెంత యని భయంపడి యాదిక్కు సనక, యాదిత్యమండల మరసినది.

అక్కడ నేడు గుఱ్ఱములు, అవియేమను, నేడు గుఱ్ఱములా, లేక, వాడిమగటిమిగల మూడు గుఱ్ఱములా, లేక, పోడిమిగల యొకేగుఱ్ఱమా, అని చూపఱు వెఱగొందునట్లు, జ్యోతిర్మయమైన జగద్బాంధవు దివ్యరథమును వాయువేగ మనోవేగముల మించి లాగుచున్నవి.

అది చూడ లేడి కా యేడు మూడు నొకఁడు మొత్తము పదునొకండును, సూర్యభగవానుఁడొకండు మొత్తము పండ్రెండు, పండ్రెండుసూర్యులై వెలుంగుచుండిన విక్రమార్కులూ— విక్రమార్కులు స్వారి కేర్పరచుకొన దన్ను గూర్చి సకిలించిన గుఱ్ఱమూ—నని యూహించి వెఱఁగుపడి "ఓ! గుఱ్ఱమా! నీవ వర్చస్వినివి. నీవ పరోపకారిణివి. నీవ బలవసివి. నీవ వీరలక్ష్మివి, నీవలన లోకములకు వెలుగును, వీర్యమును వికాస

మును గలుగుచున్నవి. నీముందు నే నెంతదానను, నన్ను క్ష మింపుము. నీ సత్యమును గనిపెట్టనైతి” నని వేడికొనెను.

గుర్తు మప్పుడు లేడిపై జాలిగొని “ని న్నీవఱకు నసత్య గ్రహముమనూ దురభిమానమునూ పీడింపఁ బడరాని పాట్లు పడి తివి. నేఁడు సత్యమును గ్రహించితి వందుచే నీ కుత్తమగతి చూపుచున్నాను. అదిగో! సత్యలోకము” అని సత్యలోకము నగపఱచెను. ఆనాటగోలె నా పందెపు లేడి భూలోక, భువ ర్లోక, సువర్లోక, చంద్రమండల, భానుమండల, నక్షత్రమండలం బుల నెల్ల నేమఱి సత్యదేవు నారాధించుచు సత్యలోకమే తన నివాసముగ నేర్పఱచుకొనియెను. దానికిఁ దిరిగి కొమ్ములు మొలచినవి గాని డాంబికభావము మొలవలేదు. అది చని పోయినప్పటికి దాని చర్మమును సశృంగముగ నెండఁగట్టి సత్య ఋషి నేటికిని తన పీఠముగ ఆ చర్మమును నిరిక్షించుకొని మి క్కిలి గౌరవించువాఁడు.

విక్రమార్కు లశ్వమేధము సేసి సత్యదేవు నారాధింప బోయినప్పుడు సత్యదేవు డారాజర్షి కిచ్చినది రాజ్యము తత్స ముగాదు. తాను గూర్చున్న లేడిచర్మమూ లేడి కొమ్ములూ.



ఈనాఁడు ఋషులు లేడిచర్మముపై నధివసించి తపం బొనర్చున దానాటినుండి వచ్చుచున్న సాంప్రదాయమే.

# 13 సర్కసు మర్కటము.



ఒక సర్కసుకంపెనీలో ఒకకోతీ ఒకకంచఱగాడిదా ఉండేవి. ప్రతిరోజూ అవి చేసే పనేంవి టంటే “ఈవేళ రాత్రి సరిగా 9-30 ఘంటలకు ఆట ప్రారంభము. అందఱూ వచ్చి చూడండి, చూచిపోండి, పోయి యానందించండి, చక్క ని తరుణము, టిక్కెట్లు డేరా గేటుగుమ్మంలో” అనే మొద లైన భాషాంతరీకరణపు టేసదోసముల సమేతంగా ముఖ్య సం గతులతో అచ్చేసి ప్రకటనపత్రికలను ఊరంట పంచిపెట్టడం- ఏరోజు కారోజు తారీఖువారీగా—

మనిషిసాయ మక్కఱలేకుండా కోతీ కంచఱ గాడిదా పంచిపెట్టేవా అని అనుకుంటారేమో, ఒక మనిషి గులామల్లీ అనే వాఁడు, కుక్కమూతి మొగం, తగిలించుకొని ఆ గాడిద ముందు దారి తీస్తూండేవాఁడు. మఱోమనిషి గుండారుభీము డనే వాడు, డప్పు వాయిస్తూండేవాడు, అందఱికీ వినబడే[redacted]గా

గాడిదమీద గజ్జరుమాలు పఱచేవారు. అదే జీను, అదే రికాబు, అదే కళ్లెం, అదే కమిచీ. కోతికి చినిగిన పాత కుళ్ళాయి, చంటిపిల్లాడి జుబ్బా లాగు తొడిగి గాడిదమీద కూర్చోబెట్టి దాని చేతిలో పైని వివరించిన ప్రకటనపత్రిక లుంచి పంచి పెట్టించేవారు గులామల్లీనీ గుండారుభీముడున్నూ. జనం ఊటీకే ఏయూరి కాయూరే మూగిపోయి మూక్కాగితం మాక్కాగితం అని లాక్కుపోయేవారు.

కాని ఆట కెప్పుడూ ఆ కంచఱగాడిదను, ఆ కోతిని, ఆ గులామల్లీని, ఆ గుండారుభీమణ్ణీ, ఉపయోగించే వారుకార్సు ఆటలో పాల్గొనే వెప్పుడు చూచినా—అరబ్బీ ఎత్తుఘోడాలు పెగూపొట్టిఘూటాలు, సయామైరావతాలు, ఆఫ్రికాసింహాలు, బంగాళ పెద్దపుల్లు, పంగిడిగూడెపు చిఱుతపుళ్ళు ఎక్కడున్న చింపంజీలు, గోరిల్లాలు, ఆస్ట్రిచ్చులు, ఉష్ట్రపచ్చులు, కొండ చిలువలు, కోడెత్రాచులు, హైనాలు, మైనాలు, హిపోపోటోమస్సులు, రినోసిరస్సులు, మాంచి పే రెక్కిన ఎతిలీట్లు, ఏకరోబెట్లు, జపాన్ దొరలు, జర్మన్ దొరసానులు, చూచేవారికి చూడ కళ్లుండా లంతే—

ఈలాగ్గా చాలకాలం వెళ్లింది.

ఓరాత్రి లోపల ఆట అవుతూవుంటే డేరా ఇవతల గా[illegible] కోతిని చూచి "నీవు మనిషి తరువాత మని షంతదానవు



నేను సృష్టికి ప్రతిసృష్టిగా బుట్టిన మహాజంతువుని, గులామల్లీ మల్లులమల్లి, గుండారుభీముడు భారతయోధు, మన నలుగురు బ్రదూకూ ఇంతేనా? ఎల్లకాలం ప్రకటనపత్రిక లిచ్చుకుంటూ పోవడమేగాని మనబలం మనశక్తి మనయుక్తి గ్రామంలోని మంచిమంచి పెద్ద లందఱకు ఎఱుకపఱచడంవంటూ లేకపోవడమేనా?" అని ఊఱకే ఏడవడం మొదలు పెట్టింది. ఏడవడంతు తోడు అఱవడంకూడా ప్రారంభించింది. వెంటనే కోతి "అఅవకు. యజమాని వింటే వచ్చి తంతాడు. నాకూ ఆలాగే అనిపిస్తూంది. ఆలోచిద్దా"మంది. అని గులామల్లీకి గుండారు భీమడికి కనుగిలికింది. వాళ్లిద్దఱూ వచ్చారు.

నలుగురూ కలసి ఆలోచించి, ఆరుబయట చింతచెట్టు క్రింద వారి వారి విద్య చూపించడానికి నిశ్చయించుకొని సర్కసుఆట అయిపోవడంతోనే ఈవల చెట్టుక్రింద ప్రదర్శించడానికి సిద్ధపడ్డారు.

జనం అంతా మూగారు. ఆ ఆటేమి టంటే గులామల్లీ కుక్కమూతితో గాడిదకు ముందు నడవడం, ఆ ముందు గుండారు భీమడు డప్పు వాయించడం, గాడిదమీద రుమాలు, రుమాలు మీద కుళ్ళాయితో కోతి ఏనాటి పాతపాత ప్రకటనపత్రికలు గాడిద మీదనే ఉండి, పైనున్న చింతచెట్టుకు గెంతి దాని కొమ్మలకు గుచ్చుతూ వుండడం. అదీ ఆట—

గాడిద కోతితో "వెధవాట ఆడేవు. డేరాలోకితీసికొని వెళ్లినా ఇంతే ఆట ఏడ్చియుండు" వని మొదటి గంతునే పెడీ ల్మి తన్నింది కిందపడేసి కోతిని. "డేరాలో అయితే గుర్రిచ్చ డానికి చింతే లేకపోను. ఈవల కాబట్టి ఈమాత్రమన్నా గెంతి ఆడాను. నాంతెలి వంతా నీముందు బూడిదపోసిన పన్నీరు అయిపోయింది." అని గుండారుభీమడి చేతిలోని డప్పుచ్చుకు గాడిద మొగాన్నేసి కొట్టింది కోతి. గులామల్లీ దూరదూరంగా జనంలో కలసిపోయి మాయమై పోయాడు.

చూచిన జనం అంతా నవ్వినవ్వి కడుపుబ్బ నవ్వి డేరాలో ఆటకంటె ఇదే బాగుంది. అక్కడేమి హాస్యరసమే లేదు, ఇక్కడంతా హాస్యరసమే ననుకుంటూ తమతమ యిళ్లకు బోయి బండుకున్నారు.

మస్తాన్డు సర్కసు యజమాని ఆ సంగతంతా విని తన సర్కసుకంపెనీ కంతకు ఛార్లస్‌ఛాప్లిన్ అంతవాని గాకోతిని, ఫాల్‌స్టాఫ్ అంతదానిగ గాడిదెను కొండాడి ఆనాటినుండీ డే[illegible]లో ఆటకు వానినికూడా తీసికొనిపోతూ వానిచే హాస్య



మును జేయించి ప్రజలను పకపకా పకపకా నవ్వించి కీర్తిచూ అందుకున్నాడు.

---

## 14 ఓగులయ్య బాగులయ్య.



శకునాల ఊరనే యొకయూరిలో ఓగులయ్య అని బాగులయ్య అని యిద్దరు సాహుకార్లుండేవారు. ఓగులయ్య ఎదురొస్తే ఎవరికి ఏ పనీ జరుగదనీ బాగులయ్య ఎదురొస్తే కార్యం బాగా నెరవేరుతుం దనీ ప్రతీతి. దానిని బురస్కరించుకొని ఓగులయ్య అంటే అందఱికీ అదోవిధమైన ఓకిలింపు. బాగులయ్య అంటే అందఱికీ అదోవిధమైన సకిలింపు. ఎల్లవారూ బాగులయ్యను పలుకరించేవారు. ఎల్లవారు బాగులయ్యను తమ కళ్లెదుట కట్టేసుకునేవారు.

ఓగులయ్య కదంతా చూస్తూవుంటే ఒళ్లు మంటగా వుండేది. తన ముఖారవిందమూ అని అప్పుడప్పుడు అద్దంలో చూచుకునేవాడు. ముఖం అందంగానే వుండేది. అప్పుడు లోకంమీద మఱీవచ్చేది కోపం—ఊరికే—ఇంత మంచి ముఖాన్ని దుర్ముఖం అనే లోకానికి బుద్ధి చెప్పా లనుకునేవాడు. కాని లోకాన్ని సాధించడ మెవరితరము? అంచేత లోకం మెచ్చుకునే బాగులయ్యను పట్టిపాలార్చి నట్టేట ముంచేసి[illegible]తపని

చేసి పరాభవిద్దా మనుకున్నాడు.

ఆ గ్రామంలోనే రాగులయ్య అనే ఓ చదువురాని వెట్టి రైతున్నాడు. "రాగులయ్యా! నీ కాపే రెల్లా వచ్చిందంటే మాతాతయ్య పేరు నా కెట్టా" రనేవాడు. మీ తాతయ్య కెలా వచ్చిం దంటే "రాగిదమ్మిడీకాడనుండీ పోగుచేసి బాగా భూమి సంపాదించడంచేత రాగులయ్య అని మాతాతయ్యకు పేరొచ్చిం" దంటాడు. "ఆలాగే నీకూ పెట్టా రనుకోరాదా? ఆ రాగి వెండ్రుకులవల్ల అంటే పకపకా నవ్వుతాడు, వెర్రి నా రాగులయ్య. అంతేకాని తన తలవెండ్రుకలు నిజంగా రాగిరంగువో బంగారవురంగువో అనికూడా చూచుకోవడం ఎఱుగడు. అంత అమాయకుడు.

రాగులయ్య ఓనాడు గ్రామాంతరం వెళ్ళవలసివచ్చి, అందఱిలాగే తనూ బాగులయ్య శకునంకోసం చూస్తూన్నాడు. కఱ్ఱ చేత పుచ్చుకున్నాడు. కిఱ్ఱుచెప్పులు తొడుక్కున్నాడు. ఎంతకు బాగులయ్య రాలేదు. త్రోవలో కనబడకపోతాడా అని అనుకుంటూ ఆలోపున చెడ్డశకునమేదైనా కనబడి పోతుందేమో అని బుఱ్ఱోంచుక బాగులయ్య ఎదురొస్తే బాగుండునని అనుకుంటూ నడుచునున్నాడు. కొంతదూరం వెళ్లేసరికి ఒకవీధి మళ్లవలసివచ్చి బుర్రొంచుకు నడవడంలో ఎద రొచ్చే మని[illegible]ని కానక ఆ మనిషితో డీక్కీ కొట్టాడు ఠంగున—ఎవరని చూచేసరికి బాగులయ్య! బాగులయ్య నెన్నొసట సరాసరి, పెద్ద ఉసిరికాయంత బొప్పి కట్టింది.



తక్షణము బాగులయ్య "ఓరి! జోగులూ! దారంట చూచుకొంటూ నడిచిపోలేవురా?" అని ఫెడీ మని లెంపకాయ కొట్టాడు రాగులయ్యను. రాగులయ్య ఎడంచెంపను బాగులయ్య కుడిచేతి అయిదువ్రేళ్లూ అంటుకుపోయినాయి. రాగులయ్య కుక్కరోషం వచ్చి "దారంట నువ్వా నేనా చూచుకోంది? నాదారి నాక్కనబడకపోతే నీదారేనోదాన్లోకలిసిం దని తన ఎడంకాలి చెప్పు బాగులయ్య కుడిదవడ సరాసరికి దీసికొనివచ్చి కొట్టబోయేడు.

అంతలో ఊరిలోని చిన్నాపెద్దా, ఏ మూలో రామకోయిల అరుగుమీద కూర్చున్న ఓగులయ్యా అంతా వచ్చి రాగులయ్య చెయ్యి పట్టుకుని ఆపి సంగతి సందర్భాలు అడిగారు. బాగులయ్య అన్నాడు. "నే నీలావస్తే ఇలా వచ్చి, నేనలా వస్తే అలావచ్చి, ఠంగున నాబుఱ్ఱ తాకాడ"న్నాడు. రాగులయ్య అన్నాడు "ఎదురుగా నువ్వొస్తే కార్యసిద్ధి అవుతుందంటారుగదా అని ఆలా అడ్డం తగిలా"నన్నాడు.

ఓగులయ్య కప్పు డనుకొన్న అవకాశం చిక్కింది. వెంటనే ఓగులయ్య రాగులయ్యను తన బుజంమీద కెక్కి[illegible]చుకొని గంతు లేస్తూ మహామంచి బాగా పరాభవించావు శ[illegible]సు

లయ్యాను. నీ యూరి ప్రియాణమాన్మాట దేవు డెఱుగు. నాకు నచ్చిన పని చేశావు." అని ఉబ్బిపోయాడు.

ఆ రోజునుంచి ఆ యూరిలో ఓగులయ్య అని బాగులయ్య అని పేర్లు తీసేసి అంతా ఒకటే, నడిచే మనలో ఉంది. మన దారి మనం సరిగా చూచుకుంటూ నడిస్తే ఎదరవాడి ముఖం బొప్పి కట్టదు, మనకు చెంపకాయలూ తగల"వని కథ చెప్పుకొంటూ బాగులయ్య చెప్పిన జవాబు ఒక వెట్టినాగులన్న జవా బని, రాగులయ్య చెప్పిన జవాబు ఒక వెట్టిజోగులన్న జవా బని, బాగులయ్యకూడా ఆ నాఁడు బుర్రొంచుకుంటూ నే పోయి యుండా లని, ఇద్దఱూ బుర్రొంచుకు పోతూంటే ఇద్దఱూ ఢీక్కొని యుండా లని తీర్మానిస్తుంటారు ఈ నాటికీ ఓ రావి చెట్టుకింద.

ఆ తీర్మానం విని ఓగులన్న "బలే! అని రావి చెట్టెక్కి రాగం తీసికొంటూ వుంటాడు. ఏం రాగం?

వెట్టినాగులు బాగులన్న,
వెట్టిజోగులు రాగులన్న,



వెట్టి, తొట్టి, కట్టి, మొట్టి,
తుట్టో అను రాగ మన్నా!

## 15 జంబూ ద్వీపము.



శ్రీమన్నారాయణమూర్తికిఁ గుమారుఁడు బ్రహ్మ. బ్రహ్మ పుత్త్రుఁడు నారదుఁడు. బ్రహ్మ పని సృజించడము నారదుని పని ఆ సృష్టి చూచి మెచ్చుకొనుచుఁ దంబుఱతీగ సుతిపోసికొనుచు సంకీర్తనము సేయుడము. శ్రీమన్నారాయణమూర్తి పని కొడుకుచేయు చేతను, మనుమడు పాడు సంగీతమును, ఒకటిఁ గని మఱొకటి విని, యూతన్మయమ్మున మాఱిగన్నుగా పాలసముద్రము మీదఁ బవళించడము.

సృష్ట్యాదిగఁ జాలకాల మిటు జరిగిన యిటీవల నొక నాఁడు బ్రహ్మ యెదో సృజించి "చూచితివే! వత్సా! నారదా! జంబూద్వీపముయొక్క సోయగము శోభ", అని పరవశపుఁ బలుక్క బల్కినాఁడు. ఏమి ఆ విచిత్ర మని నారదుఁ డా దీవినే సంచారము సేయ దివినుండి దిగినాఁడు.

దిగీదిగడములోనే నారదుని రెండు పాదములూ [illegible]కాం కోళ్ళ సమేతముగా మోకాటిబంటి బురదలో దించుకొనిపో[illegible]

నవి. వానకాల మది. పైని జీమూతముగా మబ్బులు బలిసి యఖండముగా వర్షించి వర్షించి యప్పుడే వెలిసినవేళ. ఊరూ పొలమూ, ఏరూ, నగమూ అంతా జలమయమై యున్నది. ఎక్కడ జూచినను, చలి, ఆకలి—తలదాచుకొనుట కెడము గానీ దినుటకు ఫలముఁగాని దివిజగాయకునకు చేఁ జిక్కలేదు. మఱి గోవూ, మేకా, పిల్లీ, కుక్కా మొదలగు పెంపుడు జంతువు లేమైపోయినవో? మనుష్యు లేమైరో? సమస్తము నిర్మానుష్యమును నీరవ రహస్యమును నైయున్నది.

చింతచెట్టు చూచిన వట్టియొగరు పూత. మామిడిచెట్టు చూచిన అంతయు రొట్ట; బత్తాయి, నారింజ పంపరపనస ఇవి పెద్ద మొటిమలంత పిందెలతో నున్న వంతే, తొనలు కట్ట లేదు.

తిరగ్గా తిరగ్గా ఒక్కచోటమాత్ర మొక్కచక్కి నొక్క చెఱువుగట్టున "అల్లోనేరేడు" చెట్టొకటి కొమ్మలను వ్రేలి విరివిగ గాసి దండిగఁ బండి, నల్లనిపండ్ల నురల్చుచున్నది. అది చూచి దాని కడకు బోయి యేరుబండ్లను దిని, తనువున యుసురుల నిలిపికొని, చెట్టునకు జేరగిలబడి, "నా తండ్రీ! జంబూద్వీప మని నన్ను జంబాలంబున దింపి, యీ జంబూవృక్షము నాకలిదీర్చు కల్పవృక్షముగఁ గల్పించితి వటోయి? ఇది సృజించియే వివశుడవై "జంబూద్వీపము జంబూద్వీప" మంటి



వి? నాయప్పా! జంబూద్వీప మన బంగారులంక యనుకొంటి ఇదేమి బురద? ఇదేమి వఱద! వలదు! వలదు! దీనిని లయ మొందింపు మనుచు నారదుఁడు వేడికొనె.

బ్రహ్మ తనయుని పలుకు వినక తనదారి నెదో క్రొంగ్రొత్తలు సృజించుకొనుచుండె.

కొంతవడికి వాన తెఱపిని కృషీవలులు, భూమి నెల్లను మడులు మడులుగ దమ్ముచేయుటయు, కూలియాండ్రు కొలకొల మనుచు వచ్చి యాకూడ్చుటయు, యయ్యా కూడ్చిన లేఁ జాయనీట నక్కడక్కడ తాడిచెట్లు ప్రతిఫలించుచుండుటయు, నారదుఁడు గను మొఱంగుగ గనుగొన్నవాఁడు. రాత్రి పడునంత నెల్లరు తమతమ యిండ్లకు నొక తాటిపండో యొక తాటికమ్మో చేతగొని జనుట లరసినవాఁడు. తనతో నొక్క చల్లనిచంద్రికమాత్రమే యారుబయట సాయముగనుంట నెఱింగినవాఁడు. అప్పు డాతఁ డొంటరిగా నిట్టూహించువాఁడు. "ఎంతో శ్రమపడి, దున్ని చదును చేసి, దమ్ము కమ్మియూడ్చి యింటికి జను నప్పు డక్కటా వంతున కిచ్చు నదొక తాటిపండా? ఒక తాటికమ్మా? నా తండ్రీ! యిందులకా యీప్రజల సృజించి దీనిని జంబూద్వీప మంటివి. నాయయ్యా! వలదు వలదు. దీనిని లయ మొందింపు" మనుచు బ్రతిమాలుకొనె.

బ్రహ్మ తనయుని పలుకు వినక తనదారి నెదో, కొం

గ్రొత్తలు సృజించుకొనుచుండె. ఒకచిన్నటి కాలువమాత్రి మూనాడఁ బోవుచు మీసముల చాటునుండి తెల్లని పండ్లు మెఱయించినట్లు, పచ్చని గడ్డినే జాలువాటి యన్నది. "నల్ల బంగార మిదంతా నల్లబంగారము లేనిదే పచ్చ బంగారము రాదు" అని. నారదుఁడు వినిపించుకొనలేదు. వెన్నెల చలువ నొకింత కలవరింతగ నిదురించినాఁడు.

కొంతకాల మటుచన కొంతకాల మిటుచన విసిగివిసిగి తిరిగి తొల్లింటి పొలమువంకకు నారదుఁడు ఆరు నెలలయనంతరము, రాఁ బోల మెట్లున్నది? అంతయుఁ బసుపు పచ్చని బంగరువన్నె వరివెన్నుతోఁ దూఁగాడుచున్నది. గింజగట్టితనంబు పక్షిముక్కునంబట్టి సూడవలె గాని గోటికిం జిక్కదాయె. నారదుం "డోహో! యేమి పంటవలంతి! నిజముగ జంబూద్వీపమే. బంగారులంకయే. కష్టేఫలే అనుచుఁ దన తండ్రి యొక్క నిర్మాణమునకు నిర్విణ్ణుడై పోయినాఁడు.

శ్రీమన్నారాయణమూర్తి, "బిడ్డా! నీ ఆశ్చర్యకారణమే" మని తెలియగోరి నారదుని మ్రోల సాక్షాత్కరించినాఁడు.

బ్రహ్మ యయ్యిరువురను గనక తనదారి నెదో క్రొంగ్రొత్తలు సృజించుకొనుచుండె.

ఏమా అనిచూడ! దుక్కి దున్నిన కాపునకు చేతుల



పదివేళ్లకు పది బంగారుంగ్రాలు, ఆకూడ్చిన ఆడుదానికి మెడలో పట్టుకుచ్చుతో కనబడే కాసులపేరు, గొడ్లకాసిన పిల్లలకు కాళ్లకు గజ్జెలు, చేతిలోని కూడుకొనేఁ బిల్లంగ్రోవి, పాటుపడ్డ దూడలకు గంగడోళ్లముడుతలచాలే మువ్వలు, కడుపులోని కులవలు సృజించినాడు.

నారదుఁ డిక పట్టలేక తంబుఱమీటి, తన మ్రోల సాక్షాత్కరించిన తాతయ్యనుకూడ నుపలక్షించి,

"జంబూద్వీపము చక్కనిదీవి,
జన్మస్థాన మ దేదిదొ శివి?"

అని పాడినాడు. శ్రీమన్నారాయణమూర్తి ఆ పాడుచున్న మనుమని ఎత్తి "నీది నాది ఇందున్న ముప్ఫైమూడు కోట్ల ప్రజలది అందున్న మూడుకోట్ల దేవతలది" అని యెగిరి మనుమనితోఁగూడ నంతర్ధాన మైనాఁడు.

ముప్ఫైమూడుకోట్ల ప్రజలు మూడుకోట్ల దేవతలు ఆపాట ఆమాట విని "మనదే మనదే" అని యుప్పొంగి పోవుచుందు రప్పటికి నిప్పటికి నెప్పటికి—జయ్! జంబూద్వీపమునకు జయ్!

---

# 16 గౌరీ వివాహము.



తెల్లవాఱ సాంబశివునకు గౌరిదేవికి వివాహము. చలికొండకుమాత్ర మింకను జలనము గలుగలేదు. ఎంత కాలమునుండియో గడ్డకట్టుకొనియున్న తెల్లని మంచుగడ్డను, నెఱసిన గడ్డమట్లు యుక్తే యుంచుకొని, యొడిలో గౌరిదేవిని గూరుచుండఁ బెట్టుకొని, హిమవంతుండు యోజించుచున్నాడు. కొండమీద కొండ, కొండవెనుక కొండ, కొండపక్క కొండ కలసిపోయి యమ్మహావృద్ధుని అమ్మహావృద్ధు నొడిలోఁ బెండ్లికూతుకను గనబడ నిచ్చుటలేదు.

సహజముగ గౌరి ముగ్ధ. అందున విపృద్ధుఁడగు జనకునికడ మఱీ యిది. ఒకింత సేపటి కుండియుండి యన్నదికదా యార్యా—"వారు వెండికొండకు వెల్లవేయుచున్నట్లున్నా"రని. హిమవంతుఁడు వినీవిననట్టుగ విని "అమ్మా! లేదు. ఆ తెల్లందనమగు కాంతి ఆ కొండకు సహజము" అని మిన్నకుండె. తిరిగి కొంతసేపటి కన్నదికదా యూఱకొనక పిల్ల "వారు మేరుపర్వతమును లేవ నెత్తినట్లున్నా" రని. హిమవంతుడు ప్రతికారముగ విని "అమ్మా! లేదు. ఆపసిండి మెఱుం



గులయురవడింపు లాకొండకు సహజములు" అని మిన్నకుండె. మఱికొంతసేపటి కన్నది కదా చిన్నది "నందీశ్వరుని తలయాడింపుల ననుకరించు గంటల యులివులా గున్నది. విను విను తండ్రీ!" అని. హిమవంతుండు తన ధోరణినే "అమ్మా! ఆ తలయాడింపు లతగాని కెప్పుడూ ఉన్నవే. క్రొత్తకాదు" అని మిన్నకుండె.

ఉషఃకాంతి వెల్లివిరియుచున్నది. ఆ సమయంబున గౌరి దిగ్గన లేచి "జనకా! అమ్మహాభాగుడు వచ్చి నన్నుఁ బాణిగ్రహణమున గొనుచున్నాడు. లే! పాథేయ మర్పింతము. లే! అర్ఘ్య మిత్తము లే! పూలు సల్లుదము" అనియు నెను. ఆయనుటలోనే ఆ తల్లికి ముచ్చెమటలు వోసినవి.

సాంబశివుఁడు చెలువ చెక్కిలి చెమరింపు నొత్తుచు "సఖీ! యీ రాక నాకు సహజము. నీవు శ్రమగొనకుము. మామగారిని శ్రమ పెట్టకుము. నేఁడు నేను ధన్యుఁడనైతి" నని యనియె.

ప్రమథగణంబు లెల్ల పెద్దపెండ్లివారి కెందును దీసిపోని చాడ్పు నప్పుడే బండ్లు దిగి "పెండ్లికూతుక యేది? ఏడి మా పెండ్లికొడుకు? మా బండ్లు వెనుకబడినవి. నడచినవికావు. అయిన నేమి? సుమూహూర్తము దాటకుండ వివాహమైనది" అని సంబరపడుచు నూతనవధూవరులఁ గొలిచిరి. దేవ

పూలు గురిసిరి. దుందుభులు మ్రోసినవి.

సూర్యుఁ డుదయించి, యెఱ్ఱని దీధితి గౌరీశంకర శిఖరము నలంకరించి, యొకింత మంచు గఱగించి నీరు గార్చె. అది కని నవోఢ తన్నంపుఁ దండ్రి కన్నీ రని భ్రమించి తానును గ్రుడ్లనీరు గ్రుక్కుకొనుచు వెనుదిరిగి చూచె. "బిడ్డా ఇది నాకు సహజము! నాకై యోజింపకుము. నీవు నీ భర్త కర్ధాంగివై లోకములు రక్షించుచు నారీమణుల కాదర్శనివి గమ్మా" అని హిమవంతుఁడు కూఁతుకను దీవించి, యోదార్చి యత్తింటి కంపెను.

---

## 17 కామధేనువు కోడెదూడ.



గంగిరెద్దు, బండెద్దు, తోటపెద్దు, మూడూయెడ్లే. కాని పిల్లకాయలకుమాత్రము గంగిరెద్దువద్దకు తోటపెద్దువద్దకుబోయి వాని నాడించడ మన్న మిక్కిలి సరదా. బండెద్దు దగ్గఱకు బోవడ మన్న భయము. దానిముందుకు వెళ్ళినా అది కొమ్ములతో పొడుస్తుందనీ, దానివెనుకకు వెళ్లినా అది కాళ్లతో తన్ను తుందనీ కామోసు పిల్లకాయలు బండెద్దుదగ్గఱ కంతగా పో



బండి కట్టినవెనుక బండెక్కడ మంటే మళ్ళీ చాఱవే చాఱవలోను ఉపద్రవు చాఱవ. ప్రతీ బొట్టెదూ ముందుకు వచ్చి తొట్టిలోఁ కూర్చుని కొరడాతో చల్ చల్ అని తోల్తా ననడమే.

అదేమో తెలిసికొందా మని ఒకసారి ఓ బండెద్దు! ముందుగా ఓ గంగిరెద్దు వద్దకు వెళ్లి అన్నది. "అన్నా! అన్నా నీ వంటే పిల్లల కంత ప్రేమేం? నేనంటే అంత భయమేం?" అని. అంటే గంగిరెద్దన్న దట, "అయ్యో! తమ్ముడూ! అదంతా నే నంటే గౌరవ మనుకుంటున్నావా? కాదు. అదంతా హేళన. ఆట. ఈ పిల్లకాయలతో వేగిపోతున్నాను. బసవన్నా! పాలు తాగుతావా అంటే తాగుతానంటూ బుఱ్ఱ త్రిప్పాలి. పాలు తాగవ్రా అంటే తాగనూ అని బుఱ్ఱ త్రిప్పాలి. నా యజమాని వాళ్ళ నూఱకే పొగుడుతూఉంటే నేను తాటాకలాగు ముట్టె ఊపాలి. ఇదంతా చాలా బాధగా ఉన్నది" అని అన్నదట. అప్పుడు గంగిరెద్దును చూచి బండెద్దు "అయితేం నిన్ను దాని కంతకు రంగురంగుల బొంతలు మీద వేసి కొమ్ములకు సొమ్ములు తొడిగి, యిమ్ముగ ముస్తాబు చేస్తారు నీ కేం కొదవ" అంది. అనేసరికి గంగిరెద్దు తనమీద నున్న బొంతలు తీసి లోపల శరీరము చూపించింది. అది చిక్కి శల్యమై యుంది.

ఆపళంగా బండెద్దు తిన్నగా తోటపెద్ద దగ్గఱకు వెళ్లి అంది. "అన్నా! నీవు సన్నం! శుభ్రంగా నీ యిష్టము వచ్చిన తోటలో జొఱబడి మేసేస్తావు. నీ వంటే పిల్లలకు చాలా ప్రేమ. నీకు బొట్టుపెట్టి సింహాదిరప్పన్నా! అంటూ తాళాల తో భజన చేసేరు" అని అన్నది. అది విని తోటపెద్ద కన్నీరు గారుస్తూ "నా పిల్లలు చూడు. ఎంతెంత ముద్రలు వేసి తెగ్గాల్చారో! నీబోటిదైతే తుర్రో మని తోక జాడించి యుండును ఈపాటికి. పైపెచ్చు చూశావో లేదో యీ పిల్లలు పిల్లలు కారు. వాళ్లు లే లేలోడుర్రిచ్చి యని వెంటాడించి ఎప్పుడూ నన్ను అపహాస్యము చేయడమే. తన్నితినా కాలు విఱగ కొడతారు: పొడిస్తినా కొమ్ములు కోసేస్తారు. ప్రేమనుకుంటున్నావా అదంతా" అని అంది.

బండెద్దప్పుడు అన్నిటికంటె తన పనే మెఱుగను కొంది.

అప్పటినుంచీ అది పిల్లవాళ్లను తన్నడం పొడవడం మాని వేసి తనంతట తానే కాడికిందకు చొచ్చుకుంటూ కొరడా దెబ్బ లవసరం లేకుండా గబగబా బండి లాగడం మొదలు పెట్టింది.

పిల్లవాండ్రు మహామంచి బండెద్దని దానికి మువ్వలు [illegible] గంటలు గట్టి, ఊరిప్రయాణం వచ్చిందంటే దానితో



చెట్టాపట్టా వేసి కొన్నట్టుగా తిరగడం ప్రారంభించారు. పిల్లవాండ్రంటే బండెద్దు, బండెద్దంటే పిల్లవాండ్రు అన్నంత మమకార మొకరి కొకళ్లకు కలిగిపోయి, పిల్లలొక్కొక్కప్పుడు, బండెద్దు కంటె ముందుగా తామే కాడికిందకు తమమెడలు దూరుస్తూం డడముకూడా కద్దు.

ఇదంతా కామధేనువు కోడెదూడ లేగది చూచింది, ఆకాశంనుంచి. చూచి క్రిందకు వినబడేట్టు పాడింది.

కాయగాసిన కంఠమం దా
బండెద్దుకు గంట లేలా?
కాయగాయని నాకు గడితే
గంతులేస్తూ వంతుకొస్తా
పచ్చగడ్డీ భక్షణమునకు—

అంటూ అంటూ.

పాట పూర్తి కాకుండానే పాపం! బండెద్దు తన మెడను చూచుకొంది. మెడంతా కాయగాసిపోయుంది కాడిమోసి—"నన్నునూ మోసం చేసినా రల్లఱి పిల్లకాయ" లని యింతసే పార్చింది "అంబా" అంటూ బండెద్దు. ప్రేమ అనేది యీ పెంకిపిల్లల కేకోశమందునూ యెవరియందునూ లేదని తలపోసింది తుట్టతుదకు.

కాని అలవాటుపడ్డాక తప్పుతుందా ఏ పనైనా. [illegible]

కింద కలాగే మెడ దూరుస్తూ ఉంటుంది. పిల్లకాయ లాలాగే యీనాటికీ బండెద్దు బండెద్దు అంటూ మురిసిపోతూ బండెక్కుతూ ఉంటారు. అవేళకు ఆలేగదూడ హాయిగా ఆకాశగంగ వంచ మేస్తూ పాడుకుంటూ వుంటుంది పైపాట తిరిగి మొదలు పెట్టి పూర్తిగా సావధానముగా.

— ♦ పాట ♦ —

కాయగాసిన కంఠమం దా
బండెద్దుకు గంట లేలా?
కాయగాయని నాకు గడితే
గంతులేస్తూ వంతుకొస్తా
పచ్చగడ్డి భక్షణమునకు.
బండి కంటె పైని మిగులుత.
వంగి వంగి సలాము చేసే
గంగిరెద్దును కాను, నేను,
దొంగబుద్ధిని తోట మేసే
తోటపెద్దను గాను, నేను,
కన్నెతాళ్ళట రాటఁ గట్టని
కామధేనువు కన్న కొడుకుని.
భూమికీ డిగ మంటె డిగు తూ
ప్రేమనేరని పెంకెపిల్లల



తోకతో తోలేసుకుంటూ
అంకె లేస్తా! నిశ్శంక

పిల్లలంతా పైకి జూచేరు. అంత పైనున్న కోడె దూడ నేమి చేయగలరు? ఊఁ పైకిఁ జూచేరు, తమ మెడలు నొప్పు లెత్తేటట్టు.

భూమికీ డిగమంటె డిగుతూ
ప్రేమ నేరని పెంకెపిల్లల
తోకతో తోలేసుకుంటూ
అంకెవేస్తా నిశ్శంక.

అనేసరికి ఏది ఏది అని వారులిక్కిపడి అంకెలేస్తూ ఉంటారు., బండెద్దును, మఱచిపోయి, గంగిరెద్దును మఱచి పోయి, తోటపెద్దను మఱచిపోయి, అందఱూ కామధేనువు కోడెదూడ కోసము. కామధేనువు కోడెదూడమాత్రము క్రింద కు డిగదు. ఏ పిల్లవానికి దొఱకదు—దాని కంతా స్వేచ్ఛ-

---

## 18 దేవుడు.

"అమ్మా! నా అరచేతుల్లోని కీ చార లెప్పుడు వచ్చి నవో? ఏలాగు వచ్చినవో?" చెప్పుమన్నాఁడు, తల్లిని ఒక

కింద కలాగే మెడ దూరుస్తూ ఉంటుంది. పిల్లకాయ లాలాగే యీనాటికీ బండెద్దు బండెద్దు అంటూ మురిసిపోతూ బండెక్కుతూ ఉంటారు. అవేళకు ఆ లేగదూడ హాయిగా ఆకాశగంగ వంచ మేస్తూ పాడుకుంటూ వుంటుంది పైపాట తిరిగి మొదలు పెట్టి పూర్తిగా సావధానముగా.

—♦ పాట ♦—

కాయగాసిన కంఠమందా
బండెద్దుకు గంట లేలా?
కాయగాయని నాకు గడితే
గంతులేస్తూ వంతుకొస్తా
పచ్చగడ్డి భక్షణమునకు.
బండి కంటె పైని మిగులుత.
వంగి వంగి సలాము చేసే
గంగిరెద్దును కాను, నేను,
దొంగబుద్ధిని తోట మేసే
తోటపెద్దను గాను, నేను,
కన్నెతాళ్ళట రాటఁ గట్టని
కామధేనువు కన్న కొడుకుని.
భూమికీ డిగ మంటె డిగు తూ
ప్రేమనేరని పెంకెపిల్లల



తోకత్రో త్రోలేసుకుంటూ
అంకె లేస్తా! నిశ్శంక

పిల్ల లంతా పైకి జూచేరు. అంత పైనున్న కోడె దూడ నేమి చేయగలరు? ఊ పైకిఁ జూచేరు, తమ మెడలు నొప్పు లెత్తేటట్టు.

భూమికీ డిగమంటె డిగుతూ
ప్రేమ నేరని పెంకెపిల్లల
తోకత్రో త్రోలేసుకుంటూ
అంకెవేస్తా నిశ్శంక.

అనేసరికి ఏది ఏది అని వారులిక్కిపడి అంకెలేస్తూ ఉంటారు., బండెద్దును, మఱచిపోయి, గంగిరెద్దును మఱచి పోయి, తోటపెద్దను మఱచిపోయి, అందఱూ కామధేనువు కోడెదూడ కోసము. కామధేనువు కోడెదూడమాత్రము క్రింద కు డిగదు. ఏ పిల్లవానికి దొఱకదు—దాని కంతా స్వేచ్ఛ-

---

# 18 దేవుడు.



"అమ్మా! నా అరచేతుల్లోని కీ చార లెప్పుడు వచ్చి నవో? ఏలాగు వచ్చినవో?" చెప్పుమన్నాడు, తల్లిని ఒక

డొక చిన్నబిడ్డడు. తల్లి తలనొప్పివస్తే పట్టేస్తుంది. తలలో పేలుంటే ఈరుపన్నితో యీవల కూడ్చి గోటిమీదపెట్టి టుక్కేస్తుంది. ఒంటిని మురికుంటే తుడిచివేస్తుంది, కాని యీలాంటి తలతిరిగిన ప్రశ్నలకు జవాబు చెప్పగలుగుతుందా? "నాయనా! నాకు తెలియదు. పెద్దలను కనుక్కోవా" లంది. అప్పుడే వీధమ్మట తట్టతలపాగా బుట్టచెవులుమీదకు బోర్లించినట్టుగా పెట్టుకొని సాముద్రికము తెలిసిన ఒకఆయన వెళుతున్నాడు. "పంతులుగారూ! పంతులుగారూ! మీరు పెద్దలు. మేము పిన్నలము. పిన్నలకు తెలియంది పెద్దలు చెప్పవలసియుంటుంది. ఈఅరచేతుల్లోని కీచారలు ఏలాగు వచ్చినవో ఎప్పుడు వచ్చినవో మాచిట్టిపాపడికి చెప్పండి" అని ఇల్లా లడిగింది. ఆపండితు డన్నాడు. "తల్లీ! నాకుమాత్రము తెలుసునా సమస్తమూ? ఏమో నేర్చేను సాముద్రికశాస్త్రము కాని శాస్త్రమం దెక్కడను ఈచార్లయొక్క ఉత్పత్తిని గురించి వ్రాసియుండలేదు. ఈచారలు పరీక్షించి రాబోయే సంగతులు చెప్పమంటే చెప్పగల" నన్నాడు. "పెన లడిగితే కందు లున్నాయి అనే సెట్టి కబుర్లేఉంది మీపలుకు" అని నవ్వాడు చిన్నవాడు. పండితుడు చిన్నబుచ్చుకొని తనద్దారినే వెళ్లిపోయినాడు.

"అమ్మా! నాచారలు నేనే చెప్పగలగాలి విను" అన్నాడు చిన్నవాడు. "నేను చిన్నప్పు డెప్పుడూ గుప్పిళ్లు పట్టియుంచి, విప్పితే అరటాకుముక్కల్లే వెంటనే ముణిచేసుకునే వాణ్ణట కాదే. అమ్మమ్మ చెప్పింది. అప్పు డాగుప్పిట్లో దేవు డుండి ఈచారలు గీశాడు. అందుచేతనే ఆచారలనుబట్టి దైవజ్ఞులు భావి చెప్పేమంటారు." అది వినివిని తల్లి అంది "అయియుంటుందిరా. ఏమహాత్మ్యము లేకపోతే ఆచారలవల్ల అంత తెలుస్తుందీ? మరీనీన్ని నీచేతు లప్పుడు ఎఱ్ఱగా ఉండేవి మెత్తగా ఉండేవి, నవనవలాడిపోతూ వుండేవి. ఏదేవుడూ డాగియుండకపోతే అంత ఎఱ్ఱగా అంత మెత్తగా అంత నవనవలాడిపోతూ వుండియుండడం సంభవిస్తుంది. నాతండ్రీ! నీవన్నదినిజం కావచ్చును. ఇప్పుడేమై పోయినాడో ఆ దేవుడు" అని. పిల్లవాఁ డన్నాడు. "చేతిలో దేవుడు, బొజ్జలోనికి వచ్చినాడే చూడు కడు పేలాగు ముడతలు పడిపోయిందో" అని అన్నాడు. తల్లి వెంటనే పిల్లవాని కాకలిదీఱ ఉట్టిమీద కుండలోని విన్ని పాకుండలు తెచ్చిపెట్టింది. పిల్లవాఁ డవి ఒకటొకటే తిన్నాడు. బొజ్జపైని ముడతలుపోయినవి. "ఇప్పుడు దేవు డెక్కడున్నా" డని తల్లి అడిగింది. వెంటనే పిల్లవాడు "ఎగిరిపోయినాఁడు లేడు" అని చేతులు త్రిప్పేశాడు.

పిల్లవాని తాతయ్య లోపలినుంచి వస్తూ పిల్లవాఁడు చేతులు త్రిప్పడం చూచి "లేకపోవడమేం నాతండ్రీ! [illegible]న

కూడా ఉండి, మనశరీరం రోజురోజూ ముడతలు పడేదాకా మడతలేస్తూనే వుంటాడు. నాలాగు ఒళ్ళంతా ముడుతలుపడ్డ కాలానికి తిరిగి ప్రత్యక్షమౌతాడు. ఇప్పుడిక గనబడడు" అని దగ్గుతుంటూ కుఱ్ఱవానికి బోధించినాడు. తాతయ్య దగ్గినదగ్గు కాగలేక కుఱ్ఱవాడూ తల్లీ యావన్మందీ దూరదూరముగా అంతర్ధానమైనట్లు మాయమై పోయినారు. తాతయ్య తావశము తిప్పుకొంటూ తనకూడా దేవుణ్ణిచూస్తూ స్మరించినాడు "శ్రీరామరామరామేతి రామరామమనోరమే సహస్రనామ తత్తుల్యం రామనామం వరాననే" అని. తాతయ్య చనిపోయినాడు.

"దేవుం డెవరికీ కనబడకుండగా తాతయ్యయొడలి ముడుతులలో డాగుండి తాతయ్యను పైకి తీసికొని పోయినా" డన్నాడు చిన్నపిల్లవాడు.

---

## 19 ప్రకృతి.



"విడవాలంటే కమలానికి సూర్యు డుండాలి. కలువకు చంద్రు డుండాలి. కమలాప్తు డంటే సూర్యుడు. కలువల



ఱేడు అంటే చంద్రుడు" అని అన్నగారు పాఠము చెప్పుతుంటే చెల్లెలు అడిగింది" అయితే అన్నయ్యా! పగలుమబ్బేసి సూర్యుని కప్పేసి సూర్యుని కనబడకుండా చేసి దబదబా వాన ముత్తేస్తుంటే కమలము విడువ దన్నమాటే? అమావాస్యనాడు రాత్రి చెప్పన్న చుక్కలు ఆకాశముమీద మినుకుమినుకు మంటూన్నపుడు కలువపువ్వు కళ్లు మూసుకుంటూం దన్నమాటే?" అని.

అన్నగారు ఏమని జవాబు చెప్పినాడు. "హోరున వాన కురుస్తుంటే కమలము విడిచి యుందో ముడుచుకొని యుందో చూచేవా రెవరు చెల్లీ! గాఢాంధకారములో కాసారము ఒడ్డుకు వెళ్ళి కలువపువ్వు కనిపెట్టు వా రెవరు చెల్లీ!" అని అన్నాడు.

చెల్లెలు "వెళ్ళేవా రుంటేనే,—కనిపెట్టి చూచేవా రుంటేనే"—అని రెట్టించి అడిగింది.

అన్నగా రన్నాడు. వెళ్ళేవారు గొడుగు పట్టుకొని వెళ్లకూడదు. చూచేవారు దీపము తీసికొని వెళ్లకూడదు" అని.

చెల్లెలు వెంటనే "ఆఁ" అంది. అన్నగారు "ఏం" అన్నాడు.

ఇంట్లోనుండి తల్లి "బాగానేఉంది చదు" వని [illegible]శే

సింది.

ఇద్దఱూ చెఱువుగట్టుకు పాఱిపోయినారు. కలువపువ్వు తనలో దాచేసింది చెల్లాయిని. కమలము తనలో దాచేసింది అన్నగారిని. కలువపువ్వులోనుండి తొంగిచూచింది చెల్లాయి. చెల్లాయి ముఖము చంద్రబింబములా గాపించింది పైకి. కమలములోనుండి తొంగిచూచేడు అన్నగారు. అన్నగారి ముఖము సూర్యునిలాగు దేదీప్యమానంగా తేజస్సు లీనింది వెలికి. మబ్బువేస్తే డొక్క చీరేస్తా నన్నాడు అన్నగారు. నే నున్నచోట చీకటుండనే ఉండ దంది చెల్లాయి.

చెఱువుగట్టు మీదకుఁ దల్లి వచ్చి అంది "బాగానే ఉన్నాయి ప్రతాపాలు కాఱుమేఘమూ కటికిచీకటీ కమ్ముకొని వస్తున్నాయి ఇంటికి రాండి" అంది.

చిన్నబుచ్చుకొని ఇద్దఱూ ఇంటికి వచ్చేశారు. కటికచీకటి. కాఱుమేఘము.

వాన దిమ్మరించింది. చెఱువంతా తెప్పానాం తేలానాం. విడుపు ముడుపులతో పనిలేకుండా కలువపువ్వులూ సంతోషించాయి. కమలములు సంతోషించాయి. చూచేవారు తెలిసికొనేవారు లేరు. అంతే.

# 20 శ్రీకృష్ణమూర్తి—ఒక గోపిక.



ప్రశ్న:—కృష్ణమూర్తీ! నీ ముఖమండలంబున నిండుగ చేరజేసి కళ్లు రెండుండగా, నెత్తిమీద నెమిలి కన్నెందుకోయి?

ప్రత్యుత్తరము:—నీకుఁ గనబడడానికి.

ప్రశ్న:—కృష్ణమూర్తీ! నీయమృతమయమైన పెదవిని విప్పి నాతో మాటాడవోయీ అంటే, వేణువడ్డుపెట్టుకొని యీ పాట పాడు టెందుకు?

ప్రత్యుత్తరము:—నాకు వేఱే మాట లేదని తెలిపేటందుకు.

ప్రశ్న:—కృష్ణమూర్తీ! సూర్యచంద్రతారాగణంబుల నుత్తేజితంబైన నీలనీలాంబర ముండగా నా చిన్నచీనాంబర మెత్తుకొనిపోయి పొన్నచెట్టుపైని డాచడ మెందుకోయి?

ప్రత్యుత్తరము:—నీ దిగంబరత్వము నీకుఁ జూపడానికి.



